# Chandamama Press

VADAPALANI
MADRAS 26



OFFERS YOU...

FINEST PRINTING.-

*Equipped with*

PHOTO GRAVURE
KLIMSCH CAMERA
VARIO KLISCHOGRAPH-

-BLOCK MAKING

and a
host of Others....

# కాల్గేట్‌తో చెడ్డ శ్వాసను నిరోధించండి
# రోజంతా దంతక్షయం జరుగకుండా కాపాడుకొనండి!

ఎందుచేతనంటే: ఒక్కసారి తోముకుంటేనే కాల్గేట్ డెంటల్ క్రీమ్ నోటిలో దుర్వాసనను మరియు దంత క్షయమునకు కారణమైన సూక్ష్మ క్రిములను 85% వరకు తొలగించును.

కాల్గేట్ 10 మందిలో 7 గురికి చెడ్డ శ్వాసను వెంటనే నిరోధించిందని మరియు భోజనం అయిన వెంటనే కాల్గేట్ పద్ధతిలో పళ్ళు తోముకొనుట వల్ల ఎక్కువ మందికి దంతక్షయమును బాగా అరికట్టిందని, పూర్వము దంతశాస్త్ర చరిత్రలో ఎన్నడూ తెలియ జేయనంతగా శాస్త్ర పరిశోధనల వల్ల నిరూపించబడినది! ఒక్క కాల్గేట్ మాత్రమే దీనికి రుజువును కలిగివున్నది.

పిల్లలు కాల్గేట్‌తో క్రమంగా పళ్ళు తోముకునే అలవాటును తేలికగా అవలంబిస్తారు. ఎందుచేతనంటే ఎక్కువ సేపు నిలచే దాని పిప్పర మెంట్ లాంటి సువాసనంటే వారికి చాలా ఇష్టం.

శుభ్రత కొరకు, తాజా శ్వాసకొరకు మరియు పండ్లు తెల్లగా వుండుట కొరకు కాల్గేట్‌తో పండ్లను క్రమంగా తోముకొనండి.

మీకు పౌడర్ కావాలంటే, ఈ లాభములన్నింటినీ కాల్గేట్ టూత్ పౌడర్ ద్వారా పొందగలరు... ఒక డబ్బా నెలల తరబడి వస్తుంది...







...ప్రపంచములోని ఏ ఒక్క ఇతర డెంటల్ క్రీమ్‌కన్నా కాల్గేట్‌నే ఎక్కువ మంది వాడుతున్నారు

DCG.35 TL.

# చందమామ

ఈ సంచికలో కథలు, వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.

# సర్వదా సర్వోత్తమం




★ అసమాన సౌరభ్యంలో
★ అనుపమ రుచిలో
★ కరకరలాడే తాజాదనంలో
★ సాటిలేని పుష్టికరంలో సర్వదా సర్వోత్తమం-




## గ్లూకో

బిస్కట్లు




అందుకే పార్లే గ్లూకో భారతదేశంలో
అత్యధికంగా అమ్మకమగుచున్న బిస్కట్!

everest 340ar PP TL


A
KASHYAP
PRODUCT


GLOBE
Mathematical Instruments

# ఆమె చదువు తృప్తికరంగా లేదన్నారు!

ఆ అమ్మాయి మొదట్లో ఎంతో తెలివిగా వుండేది. ఆ తరవాతే ఆమె నిర్లక్ష్యంగా, మొద్దుగా తయారయింది. అందువల్ల డాక్టర్ని సంప్రదించాను.




"పిల్లలు పెరిగే కొద్దీ అదనపు శక్తి కోసం వారికి అదనపు పోషకత్వం అవసరం. మీ అమ్మాయికి హార్లిక్స్ యివ్వండి" అని డాక్టరు అన్నారు.

ఇప్పుడు పరిస్థితి వేరు. ఆమె ఉత్సాహంతో ఉబ్బిపోతున్నది... ప్రశ్నలకు జవాబు లివ్వడంలో అందరిలో ఆమెయే మొదటిది. హార్లిక్స్ ఆమెను గురించిన సమస్యను పరిష్కారం చేసింది.



## హార్లిక్స్ వాడిన తరవాత చక్కని తెలివితేటలు...ఎంతో చురుకుదనం!

పెరిగే పిల్లలకు హార్లిక్స్ దివ్యమైనది. వాళ్ల శీఘ్రంగా వినియోగపరిచే శక్తిని యిచ్చేందుకు చాలా సార్లు వాళ్ళ మామూలు ఆహారములోని పోషకత్వము చాలదు. హార్లిక్స్ పిల్లలకు అదనపు పోషకత్వాన్ని యిస్తుంది. దీనికి కారణం, అది శ్రేష్ఠమైన సహజ ఆహార పదార్థాలతో మృదువుగా జీర్ణమయ్యేలా తయారు చెయ్యబడడమే. పిల్లల చక్కని పెరుగుదలకు డాక్టర్లు వారికి హార్లిక్స్‌ను సిఫార్సు చేస్తారు. మీ పిల్లలకు కూడ హార్లిక్స్ కావాలి!




గోధుమ పిండి మరియు మాల్టెడ్ బార్లీం పోషకవంతమైన సారములు మరియు పూర్తి మీగడ గల పాలతో చేయబడినది.



# హార్లిక్స్

అదనపు శక్తిని కలిగించును!

# దిలీప్
# అతడి స్నేహితులు

చేపలు పట్టే అద్భుతకథ




అరగంట తరువాత......






అయిదుగురు ఇంటికి బుట్టెడు చేపలతో బయలుదేరేటప్పటికి చీకటి పడింది దిలీప్ ముందు నడుస్తున్నాడు. తన చేతిలో ఎవరెడీ బ్యాటరీని ఆడించుకుంటూ









వచ్చేవారము : రైలు వస్తుంది సిగ్నల్ ఎత్తబడివుంది

**అతి తెల్లనైనకాంతి, అతి స్థిరమైన శక్తి అది ముమ్మాటికీ 'ఎవరెడి'**



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ నెల బేతాళకథ ["దొంగసొమ్ము"] పంపినవారు ఎస్. రామనాగేశ్వరరావు: ఈ కథలో ఈ నాటి పరిస్థితులు కొంత వరకు మనకు కనబడతాయి. ప్రభుత్వానికి అందకుండా దాచినసొమ్మూ, ప్రభుత్వానికి తెలియకుండా చలామణీలోకి వచ్చిన సొమ్మూ దొంగసొమ్మే.

మనుషుల మంచితనం దుర్మార్గులకు అవకాశం అవుతుంది. ప్రజల దైవభక్తిని ధూర్తులు ఎలా స్వార్థానికి వినియోగించుకుంటారో "అద్దం తిరిగిన కథ"లో మనం చూస్తాం.

సంపుటి 43 ఆగస్టు '68 సంచిక 2

CHITRA

15



# భారత చరిత్ర




ఇంగ్లీషు కంపెనీతో లోగడ ఒప్పందాలు చేసుకున్న సంస్థానాలను క్రమంగా కంపెనీ పరిపాలన కిందికి తెచ్చినవాడు వెలస్లీ. ఇలా చెయ్యటంలో అతను చాలా అక్రమాలు చేశాడు. టిప్పుతో ఇంగ్లీషు వారు చేసిన యుద్ధంలో సహాయం చేసినందుకు నిజాము నవాబు కొన్ని ప్రాంతాలను సంపాదించుకున్నాడు. అయితే 1800 లో నిజాము రాజ్యంలో ఉంచిన ఇంగ్లీషుబలాల నిర్వహణకు గాను ఆ ప్రాంతాలను తిరిగి ఇంగ్లీషువారి కిచ్చి, రాజకీయాధికారా లన్నిటినీ వదులుకుని నామమాత్రపు రాజుగా మిగలటం జరిగింది. ఇందువల్ల పరిపాలన అస్తవ్యస్త మయింది.

కర్ణాటకంలో ఇద్దరు నవాబు లుండేవారు. ఈ ఇద్దరూ టిప్పుతో చేరి కుట్రచేశారని అబద్ధపు ఆరోపణలు చేసి, అక్కడి పరిపాలనను వెలస్లీ ఇంగ్లీషుకంపెనీ పరం చేశాడు. ఇదే విధంగా వెలస్లీ తంజావూరు, సూరత్ పాలకులకు బిరుదులు మాత్రం ఉండనిచ్చి, భరణాలు ఏర్పాటు చేసి, అక్కడి పరిపాలనను కంపెనీపరం చేశాడు. ఈ చర్యను, "ధూర్తమూ, అక్రమమూ," అని బివరిజ్ అనే ఆయన వ్యాఖ్యానించాడు.

నేపాలులోయను 1768 లో గూర్ఖాలు జయించారు. అంతకు పూర్వం ఆ లోయలను పాలించినవారి మధ్య సాగిన అంతఃకలహాలు గూర్ఖాలకు లాభించాయి. క్రమంగా వారు అసాధారణమైన సైనికబలాన్ని పెంపొందించుకుని, తమ రాజ్యాన్ని విస్తరింపజేసుకునే మార్గాలు అన్వేషించసాగారు. ఉత్తర సరిహద్దున బలవత్తరమైన చీనా సామ్రాజ్యం ఉన్నది. అందుచేత గూర్ఖాలు దక్షిణంగా విస్తరించ దలిచారు.

19 వ శతాబ్దపు తొలిరోజులలో వారి రాజ్యం తూర్పున తిస్తానది దాకానూ,

పడమట సట్లెజ్‌నది దాకానూ విస్తరించింది; నేపాలుదేశం హిందూస్థానపు ఉత్తర సరిహద్దు వెంబడి ఒక బలమైన రాజ్యంగా వెలసింది.

1801 లో గోరఖ్‌పూరును కంపెనీ ఆక్రమించింది. బ్రిటిషురాజ్యం యొక్క ఉత్తర సరిహద్దు స్పష్టంగా నిర్దేశించి లేదు. గూర్ఖాలు బ్రిటిషు ప్రాంతంలోకి దాడులు చేస్తూండేవారు. 1814 మే నెలలో గూర్ఖాలు అకారణంగా బుత్వాల్‌లోని మూడు పోలీసుస్టేషన్లపై దాడి చేశారు.

కొన్ని మాసాల అనంతరం, అక్టోబరులో గవర్నరుజనరలు వారన్‌హేస్టింగ్స్ గూర్ఖాలపై యుద్ధప్రకటన చేశాడు. యుద్ధతంత్రం కూడా ఆయనే నిర్ణయించాడు. సట్లెజ్, కోసీనదుల మధ్యగల సరిహద్దు మీద నాలుగు చోట్ల ఇంగ్లీషువారి సేనలు దాడి చేశాయి. కాని నేపాలీయులు మంచి యోధులు. వారిని జయించటం తేలిక కాదు. అదీగాక పర్వతమయమైన ఆ ప్రాంతంలో ఇంగ్లీషు బలాలకు కదలటం కష్టమయింది. అందుచేత 1814-1815లో బ్రిటిషువారు చేసిన యుద్ధచర్యలు కలిసి రాలేదు. పట్నా నుంచీ, గోరఖ్‌పూరు నుంచీ నేపాలు రాజధాని పైకి ఎత్తి వెళ్లిన రెండు



బ్రిటిషు సేనలు చివరకు తిరోగమించవలసి వచ్చింది. కలంగ అనే దుర్గాన్ని పట్టుకొనటానికి దుస్సాహసం ప్రదర్శించిన జనరల్ గిలెస్పీ అనేవాడు చనిపోయాడు.

అయితే 1815 ఏప్రిల్‌లో అల్మోరా, మే నెలలో మలావ్ దుర్గమూ ఇంగ్లీషు వారికి చిక్కాయి. అటు పైన ప్రతిఘటన నిష్ప్రయోజన మనుకుని గూర్ఖాలు సగౌలీ వద్ద సంధి చేసుకున్నారు (1815 నవంబరు 28). అయితే ఈ సంధిని నేపాలు ప్రభుత్వం ఆమోదించని కారణంగా తిరిగి యుద్ధం ప్రారంభమయింది. బ్రిటిషు సేనలు నేపాలు రాజధానికి 50 మైళ్ళ

దూరంలోకి వచ్చి, మక్వన్‌పుర్ వద్ద నేపాలీయులను ఓడించాయి (1816 ఫిబ్రవరి 28). తరవాత కొద్ది రోజులకు నేపాలు ప్రభుత్వం సంధి ఒడంబడికను ఆమోదించింది.

ఈ సంధి ఫలితంగా నేపాలీయులు తమ దక్షిణ సరిహద్దున ఉన్న పల్లపు ప్రాంతాలపై తమ హక్కులను విడిచి పుచ్చారు; గర్వాల్, కుమాఓఁ జిల్లాలను బ్రిటిషువారి పరం చేశారు; సికిమ్ నుంచి వైదొలగారు; కఠ్మండులో బ్రిటిషు రెసిడెంటును ఉంచుకోవటానికి ఒప్పుకున్నారు.

ఈ సంధి ఇంగ్లీషువారికి చాలా లాభించింది. ఇప్పుడు వారి వాయువ్య సరిహద్దు పర్వతాలను అంటింది. సిమ్లా, ముసూరి, అల్మోర, నైనిటాల్ లాటి పర్వతనగరాలు వారి అధీనమయాయి.

1817 ఫిబ్రవరి 10 న ఇంగ్లీషువారు సికిమ్‌రాజాతో ఒక ఒడంబడిక చేసుకుని, నేపాలు నుంచి పుచ్చుకున్న ఒక ప్రాంతాన్ని సికిమ్‌రాజాకు ఇచ్చారు. ఇలా చెయ్యటం చేత నేపాలుకూ, భూతానుకూ మధ్య ఎడం ఏర్పడింది.

ఈ విధంగా దేశంలోని సంస్థానాలు ఒకటొకటే బ్రిటిషువారికి లొంగి పోతూ ఉంటే, మధ్య దేశంలో పిండారీ, పఠాను దండులు విజృంభించి తీవ్రమైన సంక్షోభం కలిగించాయి. రాజపుత్రస్థానం అంతః కలహాలతో ఉడికిపోయింది.

పిండారీలు 1815-1816 లో నిజాము రాజ్యాన్ని ఉత్తర సర్కారు జిల్లాలనూ కొల్లగొట్టారు. వారన్ హేస్టింగ్స్ వీరి నిర్మూలనానికి సైనిక పథకం వేసి, 1818 జనవరి నాటికి పిండారీలను రూపు మాపాడు. పిండారీల లాగే పఠానులు కూడా బందిపోటు చేస్తూ వచ్చారు. అయితే వారిని అదుపులో పెట్టటానికి వారి నాయకుణ్ణి చీలదీసి, అతని కొక చిన్న రాజ్యం ఇచ్చారు.





# అడ్డం తిరిగిన కథ

ఒక ఉళ్ళో భద్రయ్య అనే నిరుపేద ఉండేవాడు. అతనికి ఏ విధంగానూ పొట్ట గడవకపోయింది. రామాపుర మనే గ్రామంలోవాళ్ళు మూఢభక్తి జాస్తిగా గల వాళ్ళని విని భద్రయ్య, తన స్వగ్రామం వదిలి ఆ ఊరు చేరాడు. అక్కడ అతను తన వేషభాషలు మార్చుకుని దైవభక్తుడిలా వ్యవహరించ సాగాడు.

త్వరలోనే ఆ వూరివాళ్ళకు భద్రయ్యలో గురి కుదిరింది. అతను తేలికగా అందరి ఆదరానికి పాత్రుడయ్యాడు.

క్రమంగా భద్రయ్యకు దేవుడి కార్య కలాపాల్లో ప్రవేశం దొరికింది. అతనే చందాలు వసూలు చేసి, రెండు వారాల కొక వేడుక జరిపించేవాడు. ఇందువల్ల భద్రయ్యకు గొప్ప భక్తుడని పేరు రావటమే గాక, అతని భుక్తికి ఏ లోటూ లేకుండా జరిగిపోతున్నది.

ఈ పాటి విజయం సాధించాక భద్రయ్యలో ఆశ తలఎత్తింది. బాగా డబ్బు సంపాదించాలనీ, ఎప్పటికైనా ఒక లక్ష వెనక వేసుకోవాలనీ అతను నిశ్చయించు కున్నాడు. అతను మహాశివరాత్రి కోసం కాచుకున్నాడు.

రేపు మహాశివరాత్రి అనగా భద్రయ్య గ్రామస్థులను గ్రామచావడి వద్ద సమావేశ పరిచి, "భక్తులారా, రేపే మహాశివరాత్రి. రేపు మన శివాలయంలో లక్ష దీపాలు వెలి గించాలి. రాత్రంతా భజనలు జరపాలి. అలా చేసినట్టయితే మన గ్రామం ఇంకా అభివృద్ధికి రాగలదు," అన్నాడు.

దీనికి అందరూ ఒప్పుకున్నారు. భద్రయ్య చుట్టుపక్క గ్రామాలలో కూడా చందాలు వసూలు చేసి, శివరాత్రి ఉత్స వాలలో పాల్గొనటానికి ఆ గ్రామాల వారి నందరినీ ఆహ్వానించాడు.

కె. కె. రావు




జనం తండోపతండాలుగా వచ్చి పడ్డారు. ఉదయం నుంచీ ఆలయంలో కోలాహలంగా భజనలూ, అర్చనలూ, అభిషేకాలూ ప్రారంభమయినై.

భద్రయ్యను అపర శివుడుగా ఎంచుకుంటూ ఎంతో భక్తితో మనులుకునే వారిలో పాపడు అనే బీదవాడొకడు ఉన్నాడు. భద్రయ్య పాపడి చేతిలో రెండు రూపాయలు పెట్టి, వాడితో రహస్యంగా ఏదో చెప్పాడు.

భద్రయ్య చెప్పినది వినగానే పాపడికి అంతులేని ఆశ్చర్యం కలిగింది. వాడు తనలో, "ఈ ముండాకొడుకు నిజంగా భక్తుడనుకున్నాను. వీడు దేవుడి పేరు చెప్పి తింటున్నది చాలక, దేవుడి పేర ఉండే మాన్యానికే ఎసరు పెడతాడా? వీడి అంతు తేల్చి తీరాలిసింధే!" అనుకున్నాడు.

ఆ రాత్రి శివాలయంలో లక్ష దీపాలు వెలిగాయి. ఆలయం దేదీప్యమానంగా ప్రకాశిస్తోంది. శివసంకీర్తన జోరుగా సాగుతోంది. భజనలో భద్రయ్యా, పాపడూ కూడా పాల్గొన్నారు.

మధ్యలో భద్రయ్య కన్నుమలిపాడు. వెంటనే పాపడు ఒక్క గావుకేక పెట్టాడు. భజన నిలిచిపోయింది. పాపడు శివతాండవం ప్రారంభించాడు. అందరూ హడలిపోయారు. భద్రయ్య లేచి నిలబడి, "భక్తులారా! శంకరుడు పాపణ్ణి ఆవహించాడు. నిన్న రాత్రి పరమేశ్వరుడు నా కలలో ప్రత్యక్షమై, ఇవాళ ఏదోవిధంగా సాక్షాత్కరిస్తానని చెప్పి, అంతర్థాన మయాడు. అది నిజమయింది. శంకరుడికి మన భక్తవర్గంలో ఏదో దోషం కనిపించిందని నా అనుమానం," అన్నాడు.

తరవాత భద్రయ్య పాపడి కేసి తిరిగి, "స్వామీ, మా వల్ల జరిగిన లోపమేమిటో సెలవివ్వండి. తమ ఆజ్ఞ అక్షరాలా నిర్వర్తిస్తాము," అన్నాడు.





పాపడు భద్రయ్యతో, "భక్తా, నా ఆజ్ఞ ఏమిటో నీకు కలలోనే చెప్పాను. ఈ పాప కూపం నుంచి బయట పడటానికి ఇష్టం లేక, వీరందరి ముందు నిజం దాచిపెట్టి, నా ఆగ్రహానికి గురి అయావు. నీవు ఇప్పటికే నా సేవచేసి, అంతులేని పుణ్యం సంపాదించావు. నన్ను చేరుకోవటానికి ఈనాడు మహా పవిత్రమైన దినం. అందుచేత ఇవాళ సజీవ సమాధి పొంది నన్ను చేరుకోమని నిన్ను కలలో హెచ్చరించాను. నా ఆజ్ఞను ధిక్కరించావు!" అంటూ పాపడు దభాల్న కింద పడిపోయాడు.

కొద్దిసేపట్లో పాపడికి పూనకం దిగిపోయి నట్టు కనబడింది. వాడు మళ్ళీ మామూలు మనిషి అయాడు.

ఈలోపుగా అక్కడ చేరిన భక్తులు చాలా ఆర్భాటం చేశారు.

"ఆహా, జన్మంటే భద్రయ్యగారిదే జన్మ! స్వయంగా శివుడే వచ్చి తన వద్దకు ఆహ్వానించాడు. కోటిమందిలో ఒకడికి కూడా అంత అదృష్టం పట్టదు!" అని కొందరు భద్రయ్యను అభినందించారు.

భక్తుల్లో కొందరు భద్రయ్య సమాధి కోసం పలుగులూ, పారలూ తీసుకుని గొయ్యి తవ్వనారంభించారు.

భద్రయ్యకు కాళ్ళూ, చేతులూ చల్లబడ్డాయి. తనకు ఇంత ద్రోహం చేసిన పాపడి మీద కోపంతోనూ, ప్రాణభయంతోనూ అతను వణికిపోతున్నాడు.

భక్తులు అతని వద్దకు వచ్చి, "స్వామీ, ఆలశ్యమెందుకు, దయచెయ్యండి. గొయ్యి తయారయింది," అన్నారు.

"నేను అప్పుడే సమాధి అయితే ఎలాగ? భోళాశంకరుడికేం, వచ్చెయ్యమంటాడు! నేనింకా చెయ్యవలసిన పనులెన్నో ఉన్నాయి. నేను.పోతే ఈ గ్రామం గతి ఏం కాను?" అని భద్రయ్య అభ్యంతరం చెప్పాడు. గ్రామస్థు లిందుకు ఒప్పుకోలేదు.

"భలే వాడివయ్యా! ఆ పరమేశ్వరుడే వచ్చి పిలుస్తుంటే వెళ్ళనంటా వేమిటీ? మేమే నిన్ను బలవంతాన ఉంచేసుకుంటున్నామనుకుని ఆ దేవుడు మాపైన మూడో కన్ను తెరవడూ? ఇంకా నయం!" అంటూ అందరూ ఏకమై భద్రయ్యను గుంట కేసి తోసుకుపోసాగారు.

భద్రయ్యకు ముచ్చెమటలు పోశాయి. అతను ఒక్కసారి అందరినీ విదిలించేసుకుని, "పాపడూ, రక్షించు! నన్ను బలవన్మరణాన్నుంచి కాపాడు. నీ మేలు మరవను," అంటూ వెళ్ళి పాపడి కాళ్ళమీద పడ్డాడు, బావురుమని ఏడుస్తూ.

ఇది మిగిలిన వాళ్ళకు అర్థం కాలేదు. అందరూ ఆశ్చర్యపడి, పాపడి కేసి ప్రశ్నార్థకంగా చూశారు.

పాపడు వాళ్ళతో, "అసలు సంగతి చెబుతాను వినండి. ఈ భద్రయ్య పొట్ట చేత పట్టుకుని మన వూరికి వచ్చి, మనకు భక్తిమందు పోసి తన భుక్తి గడుపుకుంటూ వచ్చాడు. రానురాను అయ్యవారికి ఆకలి హెచ్చింది. దేవుడి ఆస్తి అంతా దిగమింగాలన్న ఆశ పుట్టి ఈ ఉత్సవాలు ఏర్పాటు చేశాడు. నన్ను పిలిచి, దేవుడు పూనినట్టు నటించాలనీ, దేవుడి మాన్యాలన్నీ తన పేర పెట్టమని చెప్పాలనీ నాకు రహస్య బోధ చేశాడు. అయ్యవారి అసలు రంగు తెలిసింది. మీతో చెబుదామనుకున్నా. కాని నా మాటలు మీరు నమ్మరని అనుమానం వేసింది. అందుచేత ఈ నాటకం అంతా ఆడాను," అన్నాడు.

గ్రామపెద్ద భద్రయ్యను నిజం చెప్పమన్నాడు. భద్రయ్య వణికిపోతూ నిజం ఒప్పుకున్నాడు.

ఇంతకాలం భక్తుడుగా చలామణీ అయిన వాణ్ణి చూస్తూ చూస్తూ దండించలేక, గ్రామస్థులు భద్రయ్యను తమ వూరు నుంచి వెళ్ళగొట్టేశారు.





# శిథిలాలయం

## 8

[నవరగండుపోతు, శివాలుడికి శిథిలాలయ పూజారి దాగి వున్న కొండగుహ సంగతి తెలియజేశాడు. శిఖిముఖీ, విక్రమకేసరీ కొండ ప్రాంతాలకు వెళ్ళారు. శిఖిముఖి గుహలో కదులుతున్న ఆకారాని కేసి గురి చూసి బాణం వదిలాడు. బాణందెబ్బ తింటూనే గుహలోని ఆకారం ఎలుగుబంటులా పెద్దగా గేంద్రించి బయిటికిదూకింది. తరవాత—]

శిఖిముఖి చెట్టు మీది నుంచి దిగి గుహను చేరేసరికి, విక్రమకేసరీ అతడి వెంట వున్న వాళ్ళూ, పెద్దగా కేకలు పెడుతూ ఎలుగు బంటును వెంటపడి తరుముతున్నారు. బాణం దెబ్బ తింటూనే ఎలుగుబంటు గుహ నుంచి బయటికి పచ్చి, కొండ దిగి పారిపోయేందుకు ప్రయత్నించింది.

"కేసరీ! ఆ ఎలుగ్గొడ్డును పట్టుకునేం దుకు ఎందు కంత శ్రమపడుతున్నావ్? ముందు గుహలో ఆ పూజారిగా డున్నాడేమో చూడటం అవసరం," అన్నాడు శిఖిముఖి, విక్రమకేసరిని సమీపిస్తూ.

ఆ మాటలు వింటూనే గండుపోతు అను చరులైన సవరలు, "ఇంకెక్కడి పూజారి! మనను మోసగించేందుకు వాడే యిలా ఎలుగుబంటుగా మారిపోయాడు. వాణ్ణి యీ ఆకారంలోనే పట్టుకుని నిలువునా కాల్చి భస్మం చేసేద్దాం," అన్నారు.






శిథిలాలయ పూజారి కున్నవని చెప్పబడే అపూర్వశక్తుల్లో శిఖిముఖికీ రవంత నమ్మకం వున్నది. తాటిచెట్టు పై నుంచి దిగి వచ్చే ప్పుడు అతడూ, గుహలో వున్నది ఎలు గ్గొడ్డుగా మారిపోయిన పూజారి అయి వుండొచ్చనుకున్నాడు. అలాంటప్పుడు, యీ అమాయకులైన సవరలు ఎలుగు బంటును పూజారి అని భ్రమ పడటంలో ఆశ్చర్యపడవలసిం దేమీ లేదు.

శిఖిముఖి యిలా ఆలోచించి, ఎర్ర గండును ఎలుగుబంటు మీదికి ఉసికొలు పుతూ, "కేసరీ, మీరు ఎలుగును పట్టు కోండి గండుపోతు ముతావాళ్ళు అన్నట్టు అది పూజారి అయినా కావచ్చు. అయినా కాకపోయినా వాళ్ళకు మనం కోపం తెప్పిం చటం ఎందుకు? నేను యీ లోపల గుహ లోకి పోయి, ఆ దుర్మార్గుడు చీకట్లో ఎక్క డైనా నక్కి వున్నాడేమో చూస్తాను," అని చెప్పి గుహలోకి వెళ్ళాడు.

గుహలో జాగ్రత్తగా పరీక్షించిన మీదట శిఖిముఖికి, శిథిలాలయ పూజారి అందులో కొన్నాళ్ళపాటు వున్న గుర్తులు కనిపించినై. గుహలో ఒక మూలగా పులిచర్మం ఒకటి పరిచి వున్నది. మరో మూల వంట చేసు కునేందుకు పొయ్యో, కొన్ని పాత్రలూ కని పించినై. పొయ్యి పక్కనే చమురుతో బాగా తడిపి వున్న రెండు దివిటీలు రాళ్ళకు ఆనించబడి వున్నవి.

పూజారి గుహ నుంచి పారిపోయేందుకు మరే రహస్య ద్వారం వున్న సూచనలూ శిఖిముఖికి కనిపించలేదు. అతడు యిప్ప టికి చాలా గంటల క్రితమే గుహ వదిలి పోయాడు. ఎలుగ్గొడ్డును మహా తెలివిగా యిందుకు ఉపయోగించుకున్నాడు.

శిథిలాలయ పూజారి జిత్తులమారి తనా నికి శిఖిముఖి అబ్బుర పడుతూండగా గుహ బయిటి నుంచి విక్రమకేసరి పిలుపు విని పించింది. శిఖిముఖి వెంటనే బయిటికి



వచ్చాడు. ఎలుగ్గొడ్డును ఎత్తయిన రాళ్ళ మధ్యకు తరిమి సవరలు దాని మెడకు తాడు తగిలించేందుకు ప్రయత్నిస్తున్నారు. ఎరగండు రాళ్ళ మధ్య వున్న ఒకే ఒక యిరుకు దారి నుంచి అది బయిటికి పారి పోతుండా, అక్కడ నిలబడి పెద్దగా మొరుగుతున్నది.



విక్రమకేసరి, శిఖిముఖి దగ్గిర కొచ్చి చిన్న గొంతుతో, "శిఖీ! యీ నల్లమొద్దు శిధిలాలయ పూజారి కాదని నాకూ తెలుసు. కాని, సవరల మూఢ విశ్వాసాన్ని తృణీకరిస్తే కొన్ని అనవసర చిక్కులు ఎదురయ్యే ప్రమాదం వున్నది. వీళ్ళు తమ నాయకుడైన గండుపోతుతో, ఎలుగుబంటుగా మారిన పూజారిని చేజేతులా జారవిడిచామని చెప్పి తీరుతారు. అతడికి పూజారి మంత్రశక్తుల్లో పూర్తి విశ్వాసం వున్నట్టు కనబడుతుంది," అన్నాడు.

"ఆ దుర్మార్గుడి వల్ల చిక్కుల్లో పడింతరవాత గండుపోతుకు అతడి మీద నమ్మకం పోయి, ద్వేషభావం కలిగిందని నేననుకుంటున్నాను. ఏమైనా, కొండ కింద వుండి పూజారి గుహను కాపలా కాస్తున్న వాళ్ళకు, వాడు బయటికి పోయిన సంగతి గాని, యీ ఎలుగుబంటు లోపల వున్న విషయం గాని తెలియదు. అందువల్ల మనం దీన్ని పట్టుకుపోయి, మా అయ్యాకూ, గండుపోతుకూ చూపటం మంచిది. ఆ తరవాత అరణ్యంలో పూజారిగాడి వేట ప్రారంభిద్దాం," అన్నాడు శిఖిముఖి.

శిఖిముఖి ఎలుగుబంటు వున్న చోటుకు పోయి, రాళ్ళ మీది నుంచి దాని కేసి చూశాడు. అది పెద్దగా గోండ్రిస్తూ పారి పోయేందుకు ప్రయత్నిస్తున్నది.

శిఖిముఖి చుట్టూ కలియచూసి, అల్లంత దూరంలో వున్న పొదల మీది అడవితీగల్ని కోసుకువచ్చి, వాటిని తాడుగా పేని, ఉచ్చువేసి దానిని ఎలుగుబంటి మెడ



మీదికి గురిగా విసిరాడు. అది ఎలుగుబంటి మెడకు తగులుకోగానే ఉచ్చు గొంతుకు బిగిసేలా బలంగా లాగాడు.

ఎలుగుబంటు గోండ్రిస్తూ చేతులతో తాడును తెంచేందుకు ప్రయత్నించింది. శిఖిముఖి హెచ్చరించగానే, విక్రమకేసరితో పాటు, ఇద్దరు ముగ్గురు సవరులు అతడి చేతిలో వున్న తాడును బలంగా పైకి గుంజారు. ఎలుగుబంటు ఒకటి రెండ డుగులు నేల మీది నుంచి పైకి లేచింది. శిఖిముఖి అదే అదనుగా దాని మూతికి ఒక అడవితీగను గట్టిగా రెండు చుట్లు చుట్టి ముడివేసేశాడు.



శిఖిముఖీ, విక్రమకేసరీ కలిసి ఎలుగు బంటును రాళ్ళ మధ్య నుంచి బయటికి లాగి, దాని మెడకు బిగిసివున్న తాడును సవరలకు యిచ్చి, "ఇక తిమ్మగూడేనికి పదండి. ఇది అడవిగొడ్డో, లేక శిథిలాలయ పూజారో మీ నాయకుడు సవరగండే తేలుస్తాడు," అనిచెప్పారు.

వాళ్ళు ఎలుగుబంటుతో గూడేన్ని చేరే సరికి, అక్కడ స్త్రీలూ, పిల్లలూ గుంపులుగా పోగై, "పూజారి ఎలుగు! పూజారి ఎలుగు!" అని కేకలు పెడుతూ, వాళ్ళతో పాటు శివాలుడూ, సవర గండుపోతూ వున్న గ్రామచావడికి వచ్చారు.

శివాలుడు యీ గందరగోళం ఏమిటా అని చావడిలోంచి బయటికి వచ్చి, తన కొడుకునూ, ఎలుగుబంటునూ చూస్తూనే, "ఏమిటిది? ఆ దుర్మార్గుడు పూజారి గుహలో లేడా?" అని ప్రశ్నించాడు.

"పూజారి గుహలో నుంచి ఎప్పుడో పారిపోయాడు. ఆ సంగతి కాపలావాళ్ళకు తెలియకుండా వుండేందుకు ఈ ఎలుగు బంటును గుహలో కట్టివేశాడు," అని శిఖిముఖి అక్కడ జరిగినదంతా తండ్రికి చెప్పి, "గండుపోతు కులంవాళ్ళకు యీ ఎలుగే శిథిలాలయ పూజారి అన్న నమ్మకం

వున్నది. అందుకనే దీన్ని యిక్కడికి పట్టు కొచ్చాం. గండుపోతు కూడా దీన్నోసారి చూడటం బావుంటుంది. అతడు చెప్పితే తప్ప, అతడి మనుషులకు నమ్మకం కల గదు," అన్నాడు.

ఈ లోపల గండుపోతును అతడి అను చరు లిద్దరు భుజాలు పట్టుకుని చావిడి బయటకు తీసుకు వచ్చారు. అతడు తన అనుచరులు చెప్పినదంతా విని, ఎలుగు బంటు కేసి గుచ్చి గుచ్చి చూస్తూ, "ఆ పూజారి కుక్క ఎంతకైనా సమర్థుడే! ఎందుకైనా మంచిది, యీ మెకాన్ని యింటికి తీసుకుపోయి, నా కూతురు నాగు మల్లికి ఒప్పచెపుతాను. మల్లి ఈటే, కత్తి తీసుకున్నదంటే, యిది నిజం చెప్పితీరు తుంది!" అని తన అనుచరుల కేసి తిరిగి, "మన జాగ్రత్తలో మనం వుండాలి. ఒక వేళ ఆ పూజారికుక్క అరణ్యంలోనే తిరుగుతూండొచ్చు. మన గూడేలన్నిటికీ కబురందించి, ఆ దుష్టుణ్ణి పట్టుకునే ప్రయత్నం చెయ్యండి," అన్నాడు.

గండుపోతు అనుచరులు ఎలుగు బంటును వెంట తీసుకుని అక్కణ్ణించి వెళ్ళిపోగానే శివాలుడు స్నేహపూర్వకంగా సవరగండుపోతు భుజం తట్టి, "గండు పోతూ! ఇక మేం మా పల్లెకు వెళతాం.





పూజారి మనకూ మనకూ అనవసర విరోధం తెచ్చిపెట్టాడు. అదంతా మరిచి పోదాం. నీ గాయాలు మాని త్వరలో ఆరోగ్యం కలుగుతుందని నమ్ముతున్నాను. నా కొడుకు తొందరపాటుకు విచారిస్తు న్నాను," అన్నాడు.

ఆ మాటలకు గండుపోతు బిగ్గరగా నవ్వి, "తొందరపాటా! ఆ వయసుకు ఆ మాత్రం తొందరపాటు లేకపోతే, పెరిగి పెద్దయిం తరవాత ఎందుకు పనికొచ్చేట్టు? నేనూ వయసులో వుండగా కాబొయ్యే మామ మీద యిలాంటి కాస్త మోటు సరసమే ఆడాను. నా కూతురు నాగుమల్లితో పోలిస్తే, నీ కొడుకు శిఖిముఖి ఎంతో మేదకుడుగా కనిపిస్తాడు. మీరంతా మా గూడేనికి వచ్చి రాత్రికి నే నిచ్చే విందుభోజనం తినాలి. ఈ లోపల ఆ పూజారికుక్క ఎక్కడ వున్నదీ తెలిసినా తెలియొచ్చు," అన్నాడు.

ఈ ఆహ్వానం అంగీకరించటమా, మానటమా అన్నట్టు శివాలుడు, తన కొడుకు కేసీ, విక్రమకేసరి కేసీ చూశాడు. వాళ్లిద్దరూ ఏ భావం కనబరచలేదు. కాని, ఆ ఇద్దరి కళ్ళూ గండుపోతు మీదే వున్నవి. అతడు మరేదైనా కుతంత్రం పన్నుతున్నాడేమో అన్న అనుమానం వాళ్ళను పీడిస్తున్నది.

శివాలుడి ఆలోచన గ్రహించిన వాడిలా నవరగండుపోతు తలాడిస్తూ, "ఒక కుల పెద్ద విందుకు ఆహ్వానిస్తే, మరొక కుల పెద్ద రాననటం నే నింతవరకూ చూడలేదు, వినలేదు," అన్నాడు.

"సరే, గండుపోతూ అలాగే వస్తాం. కాని, యిక్కడ వున్న మా పల్లెవాళ్ళందరూ మాత్రం మీ గూడేనికి వచ్చే అవకాశం లేదు. నేనూ, శిఖిముఖీ, విక్రమకేసరీ, మరి నలుగురైదుగురు మా వాళ్ళూ మీ గూడేనికి వస్తాం. మిగిలిన వాళ్ళంతా చీకటి పడేలోపల మా పల్లెకు పోవటం అవసరం. ఆ శిథిలాలయ పూజారి పల్లె మీద మరెలాంటి

ఘోరానికి పూనుకుంటాడో ఊహించలేం గదా," అన్నాడు.

"అదీ నిజమే. ఆ కాట్లకుక్కను పట్టుకుని చిత్రవధ చేసేవరకూ నాకు మనశ్శాంతి వుండదు. ఊఁ, బయలుదేరదామా?" అన్నాడు గండుపోతు.

శివాలుడు తన అనుచరుల్లో నలుగురైదుగురిని మాత్రం తన వెంట వుంచుకుని తతిమ్మా వాళ్ళను కుంభారమిట్ట పల్లెకు పోయి, రాత్రల్లా తగు జాగ్రత్తలో వుండమని హెచ్చరించాడు. ఆ తరవాత గండుపోతు అనుచరులు తమ నాయకుడికి డోలీ ఒకటి తయారు చేసి, అందులో అతణ్ణి కూర్చోపెట్టి, దాన్ని ఆటిద్దరూ యిటిద్దరూ భుజాలకు ఎత్తుకుని తమ గూడెం కేసి బయలుదేరారు. శివాలుడూ, శిఖిముఖీ, విక్రమకేసరీ దాన్ని అనుసరించి ప్రయాణమయ్యారు.

దాదాపు ఓ గంట ప్రయాణం తరవాత అందరూ నవరపల్లెకు చేరేసరికి, పల్లె మధ్యలో వున్న గండుపోతు ఇంటి ముందు పల్లెవాసులంతా గుమిగూడి నవ్వుతూ, కేరింతలు కొడుతూ గంతులు వేయటం వాళ్ళ కంట కనిపించింది. శివాలుడు పల్లెవాసుల ఉత్సాహం చూసి, శిథిలాలయ పూజారిని




వాళ్ళు పట్టుకొచ్చారేమో అనుకున్నాడు. కాని, తీరా దగ్గిరకు పోయి చూస్తే, గండుపోతు కూతురు నాగుమల్లి గుహ దగ్గిర దొరికిన ఎలుగుబంటు చేత రకరకాల ఆటలు ఆడిస్తున్నది.

"ఇప్పటికిప్పుడు పట్టుకున్న ఆ క్రూర మృగాన్ని యింతలోనే నీ కూతురు ఎలా మచ్చిక చేయగలిగింది, గండుపోతూ?" అంటూ శివాలుడు ఆశ్చర్యపోయాడు.

"సాహసమే నవరమహాలక్ష్మి, అన్నారు పెద్దలు. నా కూతురు సాహసంలో, ధైర్యంలో నాకు సమానురాలు, మీ శిఖిముఖి దానికి ఉజ్జీ అవునా కాదా అన్న సంశయం నన్ను

బాధిస్తూనే వున్నది. యిలా అన్నానని ఏమీ అనుకోకు, శివాలూ!" అన్నాడు గండుపోతు, కూతురు కేసి ఆప్యాయంగా చూస్తూ.

నాగుమల్లి, తండ్రిని చూస్తూనే ఎలుగుబంటు మెడకు కట్టి వున్న తాడును వదిలి, "అయ్యో, నడవలేనంతగా గాయపడ్డావా? ఏదో చిన్న దెబ్బ తగిలిందని చెప్పారే, మన వాళ్ళు," అంటూ తండ్రిని కావిలించుకుని కన్నీళ్ళు పెట్టుకున్నది.

"తగిలిన గాయం చిన్నదేనమ్మా, కాని ఎడం కాలి కీలేదో కాస్త..." అని గండుపోతు నవ్వుతూ శిఖిముఖి కేసి చేయి చూపి, "ఇంత సవరగండుపోతును డోలీ ఎక్కించిందెవరో తెలుసా? ఆ కోడెకారు శిఖిముఖి. అలా కనబడుతున్నాడు గాని——ఎంత తెగువ! ఎంత గుండె బలం!" అన్నాడు.

నాగుమల్లి చప్పున తల తిప్పి, శిఖిముఖి కేసి చూసింది. క్షణంలో ఆమె కన్నీళ్ళు మాయమయినై. కోపంతో ఆమె కళ్లు ఎఱ్ఱబడినై, ముక్కుపుటాలు అదిరినై. ఏదో అనబోయిన దల్లా ఆగి చప్పున తల పక్కకు తిప్పుకున్నది.

ఇదంతా గమనిస్తున్న విక్రమకేసరి, శిఖిముఖితో రహస్యంగా, "శిఖీ! మనకు విందు చేయటంలో గండుపోతు ఎత్తుగడ ఏమిటా అనే యింతవరకూ మనం ఆలోచిస్తున్నాం. అతడు మహా చేయగలిగితే ఆహారంలో విషం కలిపించగలడు. కాని—కూతురు నాగుమల్లి నీ మీద పగ పట్టినట్టున్నది, జాగ్రత్త!" అన్నాడు.

శిఖిముఖి ఏదో అనబోయేంతలో ఎలుగుబంటు గోండ్రిస్తూ, అక్కడ చేరిన గుంపు మీద పడి, పంజాలతో అందిన వాణ్ణి అందినట్టు కొట్టి రక్కసాగింది. గుంపులో హాహాకారాలు బయలుదేరినై. నాగుమల్లీ, శిఖిముఖీ "తప్పుకోండి, తప్పుకోండి," అని పెద్దగా కేకలు పెడుతూ ఎలుగ్గొడ్డు కేసి పరిగెత్తారు. —(ఇంకా వుంది)






# దొంగసొమ్ము

విసుగుచెందని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నీ ప్రయత్నం మంచిదే కావచ్చు. కాని సదుద్దేశాలకు కూడా దుష్ఫలితాలు కలగవచ్చు. అందుకు నిదర్శనంగా సాత్యకి అనే వాడి కథ చెబుతాను, శ్రమతెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం సాతూ్పరరాజ్యాన్ని శతకంతుడనే రాజు పాలించేవాడు. ఆ రాజ్యం అంత సంపన్నమైనది కాదు. ఆ కారణంచేత రాజు కూడా ఆటే ధనవంతుడు కాడు. ప్రజలు పేదవారు. అందుచేత రాజు తనకున్న దాని లోనే ప్రజలకు ఏదో ఒక రూపంలో ధన సహాయం చేస్తూ, మంచి పరిపాలకుడని పించుకుంటూ ఉండేవాడు.

## బేతాళ కథలు



31

సాతూప్ర రాజ్యం ఏమంత సుభిక్షం కాకపోయినప్పటికీ, అక్కడ అనేకమంది వర్తకులు సాహసవంతులై, సముద్ర వ్యాపారం చేసి, అంతులేని ధనం ఆర్జించారు. అయితే వారు తాము సంపాదించుకొచ్చిన బంగారాన్ని రాజుగారి కళ్ళపడకుండా రహస్యంగా దాస్తూవచ్చారు.

అందుచేత వర్తకులు సంపాదించే కోట్లాది ధనం రాజుగారికి అందలేదు. దానితో దేశ దారిద్ర్యం తీరే అవకాశం కూడా లేకపోయింది.

వర్తకులు చేసే ఈ దుర్మార్గం కర్ణాకర్ణిగా రాజుగారికి తెలియవచ్చింది. వర్తకులందరూ తమ తమ ఆస్తి వివరాలన్నిటినీ తనకు తెలియజేయాలనీ, అంతకు మించి ఎవరి వద్దనైనా ఉంటే తాను తీసేసుకుంటాననీ రాజు ప్రకటన చేశాడు.

వర్తకు లందరూ తమ ఆస్తి వివరాలను రాజుగారికి తెలిపారు. అనేక సంవత్సరాలుగా వారి ఆస్తులలో చెప్పుకోదగిన ఎదుగూ పొదుగూలేదు.

"మీరంతా సముద్రవ్యాపారాలు సాగిస్తున్నారుగదా, లాభాలేమీ రావటంలేదా?" అని రాజు వారిని అడిగాడు.

"మహారాజా, లాభాలు వచ్చే మాట నిజమే. కాని అవి దక్కవు. పడవలు



మునిగిపోతాయి. సముద్రపు దొంగలు సరుకు దోస్తారు. కళాసులు తిరగబడతారు. ఒక్కొక్కసారి సరుకు నష్టానికి అమ్ముకోవలసి వస్తుంది. మా కష్టాలు ఎవరితో చెప్పుకోము?" అన్నారు వర్తకులు.

వాళ్ళు అబద్ధమాడుతున్నారని రాజుకు తెలుసు, కాని వాళ్ళు రహస్యంగా దాచిన బంగారాన్ని పట్టుకోవటానికి రాజు చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయాయి. రాజుగారి వేగులవాళ్ళు ఆ బంగారం అచూకీ తీయలేకపోయారు.

సాత్వారదేశంలోనే సాత్యకి అనే మనిషి ఉండేవాడు. అతను సామాన్య వ్యక్తే, కాని అపారమైన తెలివితేటలు గలవాడు. వర్తకులు బంగారం దాచటమూ, దాని అచూకీ తెలుసుకోవాలని ప్రయత్నించి రాజుగారు విఫలుడు కావటమూ అతను చూస్తూనే ఉన్నాడు. రాజుగారికి అనిపించినట్టే సాత్యకికి కూడా వర్తకుల సౌభాగ్యం ప్రజలకు లాభించాలనిపించింది. అందుచేత సాత్యకి చిల్లర వ్యాపారస్థుడల్లే నటిస్తూ, వర్తకులకు జీతమూ బత్తెమూ లేని సేవలు చేసి పెడుతూ, వారి అభిమానాన్ని సంపాదించాడు. ఆ తరవాత వారి రహస్యాలు పసికట్టటమూ, వారు తమలో తాము మాట్లాడుకునేటప్పుడు ఉపయోగించే సంకేతాలు





అర్థం చేసుకోవటమూ అతనికి ఏమంత కష్టంకాలేదు.

అటు తరవాత సాత్యకి ఒక్కొక్క వర్త కుడి నిధినీ కొల్లగొట్టసాగాడు. వర్తకులు ఎంతో తెలివిగా ఎక్కడెక్కడో పాతిపెట్టిన బంగారం మాయం అవుతూ వచ్చింది. దొంగ ఎవరో తెలియలేదు. ఆ బంగారం రాజుగారికి తెలియకుండా దాచినది కావటం చేత రాజుగారి దగ్గిరికి పోయి, దొంగతనా లను గురించి ఫిర్యాదు చెయ్యటానికిలేదు.

సాత్యకి తాను దొంగిలించిన బంగారాన్ని ఉంచుకోలేదు. దాన్ని అతను ప్రజలలో పంచిపెడుతూ వచ్చాడు. మారు వేషాలు వేసుకుని పగటిపూట బంగారాన్ని బీదసాద లకు ఇచ్చేవాడు. రాత్రిపూట ఇళ్ళ కిటికీ లలో నుంచి పారేసేవాడు.

ఈ రహస్యం ఎంతోకాలం దాగలేదు. కటిక దరిద్రుల దగ్గిర కూడా బంగారం మెసులుతూంటే రహస్యం ఎలా దాగు తుంది? బంగారం దగ్గిర ఉన్నవారందరినీ తన వద్దకు తీసుకురమ్మని రాజుగారు తన భటులను నియోగించాడు. తమకు ఎవరో ఇచ్చినట్టు వాళ్ళు చెప్పారు.

వర్తకులు దాచిన బంగారాన్ని ఎవరో దొంగిలించి ప్రజలకు పంచుతున్నట్టు రాజు ఊహించి, ఆ పని చేస్తున్నవాళ్ళను మెచ్చు కున్నాడు. బంగారాన్ని రహస్యంగా పాతేస్తే కనుక్కోవటం కష్టంగాని, దాన్ని ప్రజలకు పంచేవాళ్ళను పట్టుకోవటం తేలిక. రాజ భటులకు సాత్యకి త్వరలో నే దొరికిపోయాడు.

దొంగతనం చేసిన నేరానికి విచారణ జరిపి సాత్యకికి రాజు కారాగృహవాస శిక్ష విధించాడు. అతను పట్టుబడ్డాక ప్రజలలో బంగారం పంచినవాళ్ళెవరూ లేకపోవటం చేత బంగారాన్ని దొంగిలించినవాడు అతను ఒక్కడే నన్నది స్పష్టమయింది.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, శత కంఠుడు సాత్యకికి సన్మానం చెయ్యక,

దొంగగా పరిగణించి ఎందుకు శిక్షించాడు? తాను కనుక్కోలేక పోయిన దొంగ బంగారాన్ని సాత్యకి బయటికి తీశాడుగద. తాను కోరినట్టే ఆ బంగారాన్ని ప్రజలకు పంచాడు గద. అటువంటప్పుడు రాజు దృష్టిలో సాత్యకి నేరస్థుడు కావటానికి కారణ మేమిటి? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "సాత్యకి చేసిన అసలు నేరం వర్తకుల బంగారం కాజె య్యటం కానేకాదు, దాన్ని రాజుగారికి ఇవ్వక తానే ప్రజలకు పంచటం. ప్రజల యోగ క్షేమాలు చూడవలసినవాడు రాజు. ఆ అధి కారాన్ని సాత్యకి నిర్వర్తించరాదు. అదీగాక వర్తకులను తనకు అనుకూలంగా చేసు కోవటం రాజుకు అవసరం. తమ బంగా రాన్ని హరించినవాణ్ణి శిక్షించినందుకు వర్త కులు రాజుకు సుముఖులు అవుతారు. పూర్వం వాళ్ళు రాజుకు వ్యతిరేకులుగా ఉండి, తమ బంగారాన్ని దాచారు. బంగా రాన్ని ప్రజలలో పంచటం కన్న, బంగా రాన్ని సంపాదించటం దేశానికి ఎక్కువ మేలు. సాత్యకి ఉన్న బంగారాన్ని మాత్రమే పంచగలడు. వర్తకులు నిత్యమూ బంగా రాన్ని సంపాదిస్తూ ఉండగలరు. అందువల్ల కూడా వర్తకులు తనకు అనుకూలించటం రాజుకు అవసరం. ఇప్పటికే కొందరు వర్త కులకు సాత్యకి ధర్మమా అంటూ బుద్ధి వచ్చింది. వారిని చూసి ఒక వేళ మిగిలిన వర్తకులకు బుద్ధిరాని పక్షంలో సాత్యకిని కారాగృహం నుంచి విడిచిపెట్టటం రాజు చేతిలో ఉన్నపనే. అందుచేత రాజు బాగా ఆలోచించే సాత్యకిని ఆ విధంగా దండించాడు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగ గానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)






# దయ్యాల దర్బారు

జపానులో ప్రాచీన వీరుల గాథలు పాటలు కట్టి పాడుకునేవాళ్ళు. వాటిని ప్రజలు విని ఆనందించేవారు. ప్రాచీన వీరులలో ఒక ప్రముఖుడుండేవాడు. అతను సముద్రం మీద శత్రువులతో పోరుతూ చనిపోయాడు. అప్పు డతని భార్య, శత్రువుల చేతికి చిక్కటం అవమానకరమని భావించి, తన కొడుకుతో సహా సముద్రంలో దూకి ప్రాణాలు తీసుకున్నది.

హోల్చి అనే గుడ్డివాడు ఏకతార మీద ఇలాటి వీర గాథలు పాడుతూ డబ్బులు సంపాదించేవాడు. ఆ డబ్బులు దాచటానికి వాడికి ఇల్లూ వాకిలీ లేదు. అందుచేత వాడొక బౌద్ధమఠం అధికారిని ఆశ్రయించి, ఆయన అనుమతితో మఠం వసారా అరుగు మీద తనకున్న కొద్ది సామానులు పెట్టుకుని ఉంటూ ఉండేవాడు. మఠాధికారి అతడితో అప్పుడప్పుడూ కబుర్లాడుతూండేవాడు.

ఒక రోజు సాయంత్రం సూర్యాస్తమయం వేళ, మఠం నిర్జనంగా ఉన్నది. హోల్చి వసారా స్తంభాన్ని ఆనుకుని కూర్చుని, చిన్నగా పాడుకుంటున్నాడు. ఆ సమయంలో ఎవరో వచ్చి వాడి చెయ్యి పట్టుకుని, "హోల్చి, నువు చక్కని పాటలు పాడతావని మా రాజుగారికి తెలిసింది. ఆయనకు నీ పాటలు వినాలని ఉన్నదిట. నిన్ను తన దగ్గిరకి తీసుకురమ్మన్నారు. పోదాం పద," అన్నాడు.

రాజుగారు పిలుస్తుంటే వెళ్ళక తప్పదు గనక, హోల్చి ఆ మనిషి చెయ్యి పట్టుకుని నడుస్తూ వెళ్ళాడు. వాళ్ళు దర్బారు చేరుకున్నట్టు హోల్చి గ్రహించాడు. ఎందుకంటే, వాడికి ఆడవాళ్ళ దుస్తుల రెపరెపలు వినిపించాయి. ఉత్తమ తరగతి స్త్రీల నుంచి వచ్చే పరిమళాలు వాడి ముక్కుకు తగిలాయి.

సి హెచ్. విజయలక్ష్మి

హెూల్ఫీని ఎత్తయిన ఆసనం మీద కూర్చొబెట్టారు. సముద్ర యుద్ధంలో చనిపోయిన మహా వీరుడి గాథను గానం చెయ్యమన్నది ఒక స్త్రీ. వాడు చక్కగా గొంతెత్తి ఆ పాటను భావయుక్తంగా పాడాడు. తనను ఆ పాటను పాడమన్న స్త్రీ పాట వింటూ వెక్కటమూ, ఏడపటమూ వాడికి వినిపించింది. ఆ పాటలో వచ్చిన మహావీరుడి భార్యే ఆ స్త్రీ అని వాడికి తెలీదు.

హెూల్ఫీని దర్బారుకు తీసుకుపోయిన మనిషే అతణ్ణి తిరిగి మఠానికి చేర్చి, "ఇలాగే ఒక వారం రోజుల పాటు దర్బారుకు వచ్చి పాడావంటే మా రాజుగారు నీకు మంచి బహుమానం ఇస్తామన్నారు," అని చెప్పి వెళ్ళిపోయాడు.

రెండు మూడు రోజులు హెూల్ఫీ దర్బారుకు వెళ్ళి వచ్చాడు. రాత్రి పూట అతను సావిడి అరుగుమీద ఉండటం లేదని మఠాధికారికి తెలిసింది. గుడ్డివాడు గదా, ఎక్కడికి పోతున్నాడా అని ఆశ్చర్యంవేసి, హెూల్ఫీని కనిపెట్టి చూడమని ఆయన ఇద్దరు నౌకర్లను నియోగించాడు.

సాయంకాలం ఆరు గంటలవేళ హెూల్ఫీ తనంతట తానే బయలుదేరి, వేగంగా నడుచుకుంటూ పోవటం చూసి నౌకర్లు ఆశ్చర్యపడ్డారు. అతన్ని నడిపించే వ్యక్తి



వాళ్ళకు కనిపించలేదు. వాళ్ళు హెూల్ఫిని అనుసరించి శ్మశానానికి వెళ్ళారు. అక్కడ వాడు ఒక ఎత్తయిన బండ మీద కూర్చుని ఏకతార మీటుతూ పాట ప్రారంభించాడు.

ఇది చూసిన నౌకర్లు హెూల్ఫిని సమీపించి, చెరొక రెక్కా పట్టుకుని మఠానికి లాక్కొచ్చి, మఠాధికారి ముందు కూలవేశారు. హెూల్ఫి ఆయనతో జరిగిన దంతా చెప్పాడు. అంతా విని మఠాధికారి ఆశ్చర్యపోయాడు. ప్రాచీన వీరులు యుద్ధాలు చేసిన ప్రదేశమూ, శ్మశానమూ ఆ మఠానికి సమీపంలోనే ఉన్నాయి. ఆ వీరుల ప్రేతాత్మలు తమ కథలను వినటానికి హెూల్ఫిని రోజూ తీసుకుపోతూ ఉండాలి.

"నిన్ను తీసుకుపోయి పాడిస్తున్నవి దయ్యాలు. వాటితో స్నేహం చేశావంటే అవి నిన్ను సర్వనాశనం చేసితీరుతాయి," అని మఠాధికారి హెూల్ఫితో అన్నాడు. హెూల్ఫి భయపడ్డాడు.

మఠాధికారి వాడికి ధైర్యం చెప్పి, "ఈసారి ఆ వ్యక్తి నీ కోసం వచ్చినప్పుడు నువు పలకనే వద్దు," అని, వాడి శరీరం అంతటా మంత్రాక్షరాలు రాశాడు.

అయితే ఆయన హెూల్ఫి చెవుల మీద మంత్రాక్షరాలు రాయటం మరచిపోయాడు. అందుచేత హెూల్ఫి కోసం మరొకసారి వచ్చిన దయ్యానికి హెూల్ఫి శరీరంలో చెవులు తప్ప ఏమీ కనిపించలేదు. ఆ దయ్యం హెూల్ఫి చెవులు పట్టుకుని బలంగా లాగి, తెంచుకు పోయింది.

హెూల్ఫికి భరించరాని వేదన కలిగింది. కాని ఆ బాధను సహించి, అతడు కిక్కురుమనకుండా పూరుకున్నాడు. మఠాధికారి హెచ్చరిక అతడికి బాగా గుర్తున్నది.

"దయ్యాల దర్బారులో పాడినందుకు నాకు లభించిన బహుమతి ఇదే," అనుకున్నాడు, హెూల్ఫి. ఆ తరవాత దయ్యాలు అతడి జోలికి రాలేదు.





# హితవు మాటలు

కొలాహల మనే దేశానికి రాజైన జయసిద్ధికి విజయు డనే కుమారుడుండేవాడు. అతను స్వతహాగా మంచి వీరధీర సాహసాలు గలవాడు. దానికి తోడు యుద్ధవిద్య లన్నిటిలోనూ గొప్ప ప్రావీణ్యం గడించాడు.

విజయుడికి ఎన్నెన్నో సాహసకృత్యాలు చేయాలని ఉండేది. కాని అతని వెంట అస్తమానమూ ఉండే అంగరక్షకులు అతనికి అవకాశం ఇచ్చేవారు కారు. రాజుగారిచేత నియమించబడిన వాళ్ళు వున్నదే అతన్ని ఆపాయం నుంచి కాపాడటానికి.

విజయుడు పెద్ద వాడై, యువరాజుగా అభిషేకం పొందే ముందు, ఒకసారి తమ రాజ్యమంతా పర్యటించాలన్న కోరిక వెలిబుచ్చాడు. తండ్రి దానికి అంగీకరించాడు.

"అవును. యువరాజువు కాబోతున్న నువ్వు మన రాజ్యంలో ఎక్కడెక్కడ ఏమి ఉన్నదీ చూసుకోవటం మంచిదే. ఎక్కడెక్కడ ఏమి సహజసంపద ఉన్నదీ, ఏ ప్రాంతాల ప్రజలు ఎలా బతుకుతున్నదీ చక్కగా గ్రహించు. నీ పర్యటనలో ముఖ్యంగా మూడు విషయాలు శ్రద్ధగా పాటించు. కొంచెంసేపు కూడా ఒంటరిగా ప్రయాణించకు. విశ్రాంతి తీసుకున్న చోటిని విడిచి బయలుదేరేటప్పుడు, ఒకసారి ఆ చోటును కలయజూసుకోకుండా ముందుకు వెళ్ళకు. మన అడవులలో ఎలుగుబంట్లు జాస్తిగా ఉంటాయి; వాటిని ఎన్నడూ ఎదిరించకు. నేల మీద నిశ్చలంగా పడుకున్న మనిషి జోలికి ఎలుగుబంటి ఎన్నడూ రాదు. అందుచేత ఎలుగుబంట్లు తటస్థపడినప్పుడు నీ పౌరుషాన్ని కట్టిపెట్టి, చచ్చిపోయినట్టుగా నేల మీద బిగదీసుకుని పడుకో," అన్నాడు విజయుడి తండ్రి.

విజయుడు ఈ రాజ్యపర్యటన ఒంటరిగా, స్వేచ్ఛగా చేయాలనుకున్నాడు. కాని

జె. వసంతకుమార్



రాజుగారు అతనికా స్వేచ్ఛ ఇవ్వక, ఇద్దరు సమర్థులైన భటులను అతని వెంట పంపాడు. ఇది విజయుడికి ఏమాత్రమూ నచ్చలేదు. తండ్రి చెప్పిన హితవాక్యాలు కూడా అతనికి నచ్చలేదు. అవి పిరికివాళ్ళు పాటించేవిగా అతనికి తోచాయి.

తన ఇద్దరు అంగరక్షకులనూ వెంటబెట్టుకుని విజయుడు రెండు రోజులు ప్రయాణం చేసి ఒక అరణ్యాన్ని చేరుకున్నాడు. అంగరక్షకులు తనను అనుక్షణమూ కంటిని రెప్పల్లాగా కాపాడుతూ, వెన్నంటి రావటం అతనికి మహా చిరాకు కలిగిస్తున్నది.



అరణ్యంలో ప్రవేశించాక తనకు సాహస కృత్యాలు చేసే అవకాశాలు కొల్లలుగా దొరుకుతాయని విజయుడు ఆశపడ్డాడు. కాని, అంగరక్షకులు అరణ్యం గుండా ప్రయాణించ వద్దనీ, చుట్టు తిరిగి పోదామనీ అతడికి చెప్పారు.

విజయుడికి మండిపోతున్నది. అతను వాళ్ళతో మంచిగా, "ఎడమపక్కగా చుట్టిపోతే బాగుంటుందో, కుడిపక్కగా చుట్టిపోతే బాగుంటుందో తెలుసుకోవటం అవసరం. మీరిద్దరూ చెరోపక్కా కొంతదూరం వెళ్ళి చూసిరండి. ఏ దారి బాగుంటే ఆ దారినే పోదాం. మీరు తిరిగి వచ్చేదాకా నేనిక్కడే ఉంటాను," అన్నాడు.

ఇద్దరు భటులూ చెరొకవైపూ బయలుదేరారు. వాళ్ళను కనుమరుగు కానిచ్చి, "పీడ విరగడ అయింది!" అనుకుని, విజయుడు అరణ్యంలోకి ప్రవేశించి గబగబా ముందుకు సాగాడు.

అతనలా కొంతదూరం వెళ్ళేసరికి ఒక పెద్దపులి గాండ్రిస్తూ అతని పైన దూకింది. అటువంటి అవకాశాల కోసమే తహతహలాడుతున్న విజయుడు ఉత్సాహంతో కత్తి దూసి, పెద్దపులితో హోరాహోరి పోరాడి, దాన్ని చంపేశాడు.



పులి చచ్చిపోయాక అతను ఒక చోట కూర్చుని, ఆయాసం తీర్చుకుంటూ, "ఇటు వంటి ప్రమాదా లెన్నివచ్చినా నేను అవ లీలగా ఎదుర్కొనగలనుగదా. నా వెంట ఈ అంగరక్షకులేమిటి? నేను పౌరుషంలేని ఆడదాన్నయినట్టు!" అనుకున్నాడు.

అతను సేదదీరాక కూర్చున్న చోటి నుంచి లేచి, ముందుకు సాగాడు. కొంత దూరం వెళ్ళాక అతనికి అరణ్యంలో అలి కిడి వినిపించింది. ఏవో అరణ్య మృగాలయి ఉంటాయని అతను అప్రయత్నంగా కత్తి మీదికి చెయ్యి పోనిచ్చాడు. కాని కత్తి లేదు. దాన్ని అతను తాను విశ్రాంతి తీసుకున్న చోట పక్కన పెట్టుకుని కూర్చుని, అక్కడే వదిలి వచ్చేశాడు.

ఇంతలో గురగుర ధ్వనులు చేస్తూ ఎలుగుబంట్లు అతని కేసి రావటం కనిపిం చింది. రెండు ఎలుగుబంట్లున్నాయి. కత్తి ఉన్నా వాటితో ఒంటరిగా పోరటం కష్టమే. కత్తి లేదు కూడానూ. ఎలుగుబంట్ల మీద ప్రతాపం చూపవద్దనీ, అవి తటస్థపడితే నేల మీద చచ్చినట్టు పడుకోమనీ తండ్రి చెప్పిన హితవాక్యాలు విజయుడికి జ్ఞాపకం వచ్చాయి. అతను అలాగే నేల మీద బిగ దీసుకుపోయి పడుకున్నాడు. ఎలుగుబంట్లు అతని జోలికి రాకుండా వెళ్ళిపోయాయి.



విజయుడు లేచి, తాను పులిని చంపిన చోటికి తిరిగి వెళ్ళి, తన కత్తిని తీసుకుని, అరణ్యంలో ముందుకు వెళ్ళే ఆలోచన కట్టిపెట్టి, తాను బయలుదేరిన చోటికే తిరిగి వెళ్ళాడు.

అక్కడ అతని అంగరక్షకులు లేరు. వాళ్ళు తిరిగి వచ్చి, రాజకుమారుణ్ణి కానక, అతని కోసం ఆ చుట్టుపట్ల వెతుకుతూ తిరుగుతున్నారు.

అప్పటికి మిట్టమధ్యాహ్నమయింది. ఆకలిదప్పులు అతన్ని బాధించసాగాయి. ఆ సమీపంలోనే అతనికి ఒక తోటా, దాని మధ్య ఒక కొలనూ కనిపించాయి. కొలను చూడగానే అతనికి అందులో స్నానం చేయాలనిపించింది. అందుచేత అతను తన బట్టలు విప్పి ఒడ్డునపెట్టి, సుఖంగా స్నానం చేసి, తిరిగి ఒడ్డుకు ఎక్కేసరికి అతని బట్టలు లేవు. అతను చుట్టూ చూశాడు, పైకి చూశాడు. చెట్ల మీద కోతులున్నాయి. వాటి వద్ద అతని బట్టలున్నాయి. వాటిని అవి తిప్పి తిప్పి చూస్తూ, మధ్య మధ్య కొరికి కూడా చూస్తున్నాయి.

ఒంటరిగా ఉండనట్టయితే ఇలా జరిగేది కాదు. తండ్రి నిజం చెప్పాడు. తన భటులు వెంట ఉన్నట్టయితే కోతులు ఆ బట్టలను ఎత్తుకుపోయి ఉండవు.

చేసేదిలేక విజయుడు రాళ్ళు తీసుకుని కోతులను కొట్టాడు. అవి బట్టలను అతని కేసి విసిరాయి.

బట్టలైతే దొరికాయిగాని, అవి చీలికలూ, వాలికలూ అయి ఉన్నాయి. అతను వాటినే ధరించవలసి వచ్చింది.

ఇంతలోనే అతని అంగరక్షకులు కూడా వచ్చి అతన్ని చేరుకున్నారు.

అటుతరవాత విజయుడు తన తండ్రి చెప్పిన హితవులను తూచా తప్పకుండా పాటిస్తూ ఎలాంటి ప్రమాదాలకూ గురి కాకుండా రాజ్యపర్యటన ముగించుకున్నాడు.





# కష్టం

పూర్వం కాంచీపురంలో విశ్వగుప్త డనే వైశ్యుడికి గుణవతి అనే భార్యా, నలుగురు కొడుకులూ ఉండేవారు. ఒకప్పుడు వారి వంశం చాలా సంపన్నమైనది. కాని రాను రాను వారి సంపద అంతా తరిగిపోయింది. అందుచేత విశ్వగుప్తుడి కుమారులు అందరి లాగే స్వార్జితం మీద బతకవలసిన స్థితిలో ఉన్నారు. వారిలో పెద్దవాడు రామగుప్తుడు మాత్రమే బుద్ధిమంతుడు, మిగిలిన ముగ్గురూ వట్టి అప్రయోజకులు.

కొడుకులు ఇంకా చిన్నవాళ్ళుగా ఉండగానే విశ్వగుప్తుడు చనిపోయాడు. తరవాత గుణవతే పిల్లలను పెంచి పెద్దచేసింది. రామగుప్తుడికి తగిన కన్యను తెచ్చి గుణవతే పెళ్ళి చేసింది. ఎందుకైనా పనికివచ్చేది రామగుప్తుడే నని ఆమెకు తెలుసు.

కొద్దికాలానికి రామగుప్తుడికి ఒక కుమార్తె కలిగింది. ఆ పిల్లకు వసుమతి అని పేరు పెట్టుకున్నారు. వసుమతి చిన్న పిల్లగా ఉండగానే గుణవతికి జబ్బు చేసింది. మందు లేమీ పనిచెయ్యలేదు. అందుచేత ఆమె తనకు కాలం సమీపించిం దనుకుని, తన పెద్ద కొడుకు కోసం కబురు చేసింది. రామగుప్తుడు తల్లి వద్దకు వచ్చాడు. తమ అన్న కోసం తల్లి కబురు చేసిన సంగతి రామగుప్తుడి తమ్ముళ్ళకు తెలిసింది. తమ తల్లి ఎక్కడో డబ్బు దాచి ఉంచిందనీ, ఆ రహస్యం తమ అన్నతో చెప్పబోతున్న దనీ అనుమానించి, వాళ్ళు కూడా వచ్చి, చాటున పొంచి ఉండి, తమ తల్లి తమ అన్నతో చెప్పే మాటలన్నీ ఆలకించారు.

రామగుప్తుణ్ణి మంచం మీద కూర్చోమని గుణవతి అతనితో, "నాయనా, మన ఇంట్లో దేవుడిపీఠం కింద, రాగిచెంబులలో బంగారు నాణాలున్నాయి. కాని వాటిని తాకరాదు. అదివరకు మన వంశంలో కొందరు వాటిని

టి. మాధవరావు



అందాకా వీటిని ఎవరూ తాకటానికి వీల్లేదు. తాకితే నాశనమైపోతారు,' అన్నదట," అని గుణవతి చెప్పింది. తరవాత కొద్దిసేపటికే ఆమె కన్నుమూసింది.

తల్లి మాటలను విన్న రామగుప్తుడి తమ్ములు, తమ తల్లి పరిస్థితిని కూడా లక్ష్యపెట్టక, గునపం తీసుకు వెళ్ళి, దేవుడి పీఠాన్ని తొలగించి, దాని కింద తవ్వారు. కొద్ది లోతున అయిదు రాగిచెంబులూ, వాటి నిండా బంగారు మాడలూ ఉన్నాయి. చెంబుల మెడలకు ఒక బంగారుతీగ మెలి చుట్టి ఉన్నది.

వాళ్ళు చేసేపని చూసి రామగుప్తుడు వారిని వారించటానికి ప్రయత్నించాడు, కాని వాళ్ళు అతన్ని లక్ష్యపెట్టలేదు. అతని తమ్ముళ్ళలో పెద్దవాడు చెంబులను పైకి తీయబోయాడు. కాని అవి కొంచెం కూడా కదలలేదు. పైగా వాడు ఆ క్షణంలోనే నెత్తురు కక్కుకుని పడిపోయాడు. అది చూసి మిగిలిన ఇద్దరూ పారిపోయారు.

రామగుప్తుడు ఆ చెంబుల మీద తిరిగి మట్టికప్పి, దేవుడి పీఠాన్ని యథాస్థానంలో ఉంచాడు.

ఏళ్ళు గడిచిపోయాయి. వసుమతి పెద్ద దయింది. ఆమె అపురూప లావణ్యవతిగా

తవ్వి తీయ ప్రయత్నించారు. వాళ్ళు వాటిని తీయలేకపోగా, దారుణమైన అపాయాలకు గురి అయారు. అందుచేత నువ్వెన్నడూ వాటి జోలికి వెళ్ళకు. అయితే వాటిని గురించి నీ తరవాత తరంవాళ్ళకు చెప్పి, వాళ్ళనుకూడా ఇలాగే హెచ్చరించే బాధ్యత నీ పైన ఉన్నది," అని చెప్పింది.

"అసలు ఆ చెంబులను అక్కడ దాచిన దెవరు? నీకు తెలుసా, అమ్మా?" అని రామగుప్తుడు అడిగాడు.

"ఏనాడో మన వంశానికి చెందిన ఆవిడే చనిపోతూ, వాటిని అక్కడ పాతిపెట్టి, 'నేను మళ్ళీ పుట్టి వీటిని తీసుకుంటాను.

తయారయింది. రామగుప్తుడు తన కుమా ర్తెకు తగిన వరుడి కోసం వెతకటం ఆరంభించాడు. నిజంగా వసుమతికి తగిన వరుణ్ణి సంపాదించాలంటే కట్నం కింద చాలా ఇవ్వాలి. కాని రామగుప్తుడి వద్ద అంత ధనం లేదు.

ఒకనాడు వసుమతి నీళ్ళు తేవటానికి కంపానదికి వెళ్ళి, అక్కడ ఒక యువకుణ్ణి చూసింది. అతను గుర్రంమీద సవారీ అయి వస్తున్నాడు. అతన్ని చూసి వసుమతి, "ఎంత అందంగాఉన్నాడు!" అనుకున్నది.

అదేసమయంలో ఆ యువకుడు కూడా ఆమెను చూసి, "ఎంత అందంగా ఉన్నది!" అనుకున్నాడు.

ఆ యువకుడి పేరు భానుగుప్తుడు. అతని తండ్రి ప్రసన్నగుప్తుడు కాంచీపురంలోని గొప్ప ధనికులలో ఒకడు. దానికి తోడు ఆయన పరమ లోభి. తన కొడుక్కు వెయ్యిమాడలు కట్నం ఇస్తేనే గాని పెళ్ళి చెయ్యనని అంటూ వస్తున్నాడు.

నదీ తీరాన వసుమతిని భానుగుప్తుడు తరుచు కలుసుకుంటున్నాడు. వారి మధ్య స్నేహభావం ఏర్పడ్డది. వసుమతిని పెళ్ళాడాలని తనకు కోరిక ఉన్నట్టు భానుగుప్తుడు ఒకసారి బయట పెట్టాడు.



ఆ రోజే వసుమతి ఈ మాట తన తండ్రికి తెలిపింది. రామగుప్తుడు ప్రసన్నగుప్తుడి వద్దకు వెళ్ళి, "మా కుమార్తెను మీ అబ్బాయికి చేసుకోండి. వాళ్ళు ఒకరి కొకరు ఎంతైనా తగి ఉంటారు," అన్నాడు.

"మా వాడికి వెయ్యి బంగారు మాడలు కట్నం ఇచ్చే మాటుంటే పెళ్ళి సంగతి మాట్లాడండి, లేకపోతే ఆ మాటే ఎత్తవద్దు," అన్నాడు ప్రసన్నగుప్తుడు. రామగుప్తుడు హతాశుడై ఇంటికి తిరిగి వచ్చి తన కుమార్తెకు జరిగినది చెప్పాడు.

ఆ రాత్రి వసుమతికి కలలో రాగి చెంబులూ, వాటి నిండా ఉన్న బంగారు

మాడలూ కనిపించాయి. అవి దేవుడి పీఠం కింద ఉన్నట్టు ఆమె చూసింది. కాని ఆ కలను ఆమె అంతగా పట్టించుకో లేదు. అయితే అదే కల ప్రతి రాత్రీ రాసాగింది. అందుచేత ఆమె ఒకనాడు తన తండ్రితో, "నాన్నా, దేవుడి పీఠం కింద అయిదు రాగి చెంబులలో బంగారు మాడలున్నట్టు నాకు రోజూ కల వస్తున్నది. ఇది నిజమా?" అని అడిగింది.

ఆ మాట విని రామగుప్తుడు అదురు కుని, "అమ్మా, నువు కలలో చూసిన చెంబులు నిజమే గాని, వాటిని మరిచిపో. వాటిని తాకిన వాళ్లు సర్వనాశనమయి పోతారు," అంటూ తనకు తన తల్లి చెప్పి నదీ, తన కళ్ళ ఎదట తన తమ్ముడు రక్తం కక్కుకున్నదీ వివరించి చెప్పాడు.

తండ్రి చెప్పిన విషయాలను గురించి వసుమతి దీర్ఘంగా ఆలోచించి, ఒక నిర్ణ యానికి వచ్చింది. తాను భానుగుప్తుణ్ణి పెళ్ళాడ లేకపోతే తన జీవితమే గాక, భానుగుప్తుడి జీవితం కూడా భ్రష్టవుతుందని ఆమెకు తోచింది. అంతకంటె ఆ రాగి చెంబులలో ఉండే బంగారు మాడల కోసం ప్రయత్నించి తాను ఒక్కతే శీఘ్రంగా దుర్మరణం పొందటం మేలు.

ఇలా అనుకుని వసుమతి, తండ్రి ఎంత లబలబలాడుతున్నా అగక, గునపం తీసు కుని, దేవుడి పీఠం కింద తవ్వి, దాని కింద ఉన్న రాగిచెంబులను అవలీలగా పైకి తీసింది. రామగుప్తుడు నిర్ఘాంతపోయాడు.

ఒక్కొక్క చెంబులోనూ అయిదు వందల మాడలున్నాయి. మొత్తం రెండు న్నరవేల మాడలు! అవి వసుమతి సొమ్మే అయి ఉండాలి.

రామగుప్తుడు తన కుమార్తెకు భాను గుప్తుడితో పెళ్ళి నిశ్చయించటమే గాక, కట్నం కింద వెయ్యి మాడలూ యిచ్చి, పెళ్ళి మహా వైభవంగా చేశాడు.





# పోటీ పరీక్ష

అంగదేశపు యువరాజు జయదేవుడు యుద్ధవిద్యలలో ఆరితేరినవాడు. అతని వెంట అతని ఈడువాళ్ళు ఏడెనిమిదిమంది అస్తమానమూ ఉంటూ ఉండేవాళ్ళు. వారందరూ మంచి యోధులే. జయదేవుడు వారిని వెంటబెట్టుకుని వేటకు వెళ్ళేవాడు, లేదా యుద్ధవిద్యలలో పోటీలు జరిపేవాడు. రాత్రిపూట వారితో విందులారగించేవాడు.

ఒక వెన్నెలరాత్రి అందరూ విందు చేసుకుంటూండగా జయదేవుడు, "నాకు తగిన రాజకుమార్తె దొరికితే పెళ్ళాడదామనుకుంటున్నాను. గొప్ప సౌందర్యవతీ, సౌశీల్యవతీ అయిన రాజకుమార్తె ఎక్కడ లభించేదీ మీలో ఎవరన్నా చెప్పగలరా?" అని తన అనుచరులను అడిగాడు.

ఎవరూ మాట్లాడలేదు, కాని విక్రముడనేవాడు యువరాజుకు ఈ విధంగా సమాధానం చెప్పాడు:

"నాయకా, మణిపురరాజుకు ఇద్దరు కుమార్తెలున్నారు. పెద్ద కుమార్తె లీలావతి యుద్ధవిద్యలలో ఆరితేరినది. ఆమె ఇంటిపట్టున ఉండదు. ఎప్పుడూ గుర్రం ఎక్కి తిరుగుతూ ఉంటుంది, అరణ్యాలలో మృగాలను వేటాడుతూ ఉంటుంది, కొండలలో దొంగల ముఠాలను చీల్చిచెండాడుతూ ఉంటుంది. మణిపుర రాజు రెండో కుమార్తె లక్షణ చాలా అందమైనది. కళలలో ప్రావీణ్యం గలది. ఆమె స్వభావం చాలా సుకుమారమైనది, హృదయం సున్నితమైనది. ఆమె అన్నివిధాలా మీకు తగిన భార్య అవుతుంది."

"అలా అయితే, కోరినంత బలాన్ని వెంట తీసుకుని వెళ్ళి, సామదండోపాయాలలో ఏది అవసరమైతే అది ప్రయోగించి ఆ లక్షణను యిక్కడికి తీసుకురా!" అన్నాడు జయదేవుడు.

బి. నాగేశ్వరరావు



"నా వెంట బలాలు అవసరం లేదు. మరొక యోధుణ్ణి తోడుగా పంపండి, చాలు. మణిపుర రాజు దగ్గిర ఉండే భటుల శౌర్యపరాక్రమాలు నాకు తెలిసినవే. నే నా రాజు కొలువులో మూడేళ్ళు పని చేసి ఇక్కడికి వచ్చాను," అన్నాడు విక్రముడు.

నిజానికి విక్రముడు చాలా గొప్ప యోధుడు. జయదేవుడి పరివారంలో అతన్ని మించగలవాడు మరెవడూ లేడు. అతని పరాక్రమం ఎంత విశ్వసనీయమైనదో, అతని మాట కూడా అంత నమ్మదగినదే. అందు చేత జయదేవుడు విక్రముడితో, "విభూతిని వెంటబెట్టుకు వెళ్ళు," అన్నాడు.

విభూతి విక్రముడికి నీడలాటివాడు; ఎప్పుడూ విక్రముణ్ణి అంటి పెట్టుకు తిరిగే వాడు. ఇద్దరూ గుర్రా లెక్కి, దారి వెంట కబుర్లు చెప్పుకుంటూ మణిపురం చేరారు.

మణిపురరాజు తన పాత భృత్యుడైన విక్రముడి పట్ల చాలా ఆదరణ చూపి, "ఏమోయ్, ఇలా వచ్చావు? మళ్ళీ మా కొలువులో చేరతావా ఏమిటి?" అని ఛలోక్తిగా అడిగాడు.

"లేదు, మహారాజా. నేను పెళ్ళి పని మీద వచ్చాను. మా యువరాజుగారైన జయదేవుడు మీ రెండో కుమార్తెను, లక్షణను, పెళ్ళాడగోరి, నన్ను పంపారు," అన్నాడు విక్రముడు.

రాజుకు పట్టరాని ఆగ్రహం వచ్చింది.

"దుర్మార్గుడా, మూడేళ్ళు నా ఉప్పుతిని ఇంత ద్రోహంగా మాట్లాడతావా? లీలావతి అవివాహిత అయి ఉండగా లక్షణ పెళ్లి ప్రస్తావన తీసుకురావటం లీలావతికీ, నాకూ ఎంత అవమానం! ... ఎవర్రా అక్కడ? ఈ దుర్మార్గుణ్ణి తీసుకుపోయి చీకటికొట్టులో పడెయ్యండి," అని రాజు ఆవేశంతో అరిచాడు.

కొందరు భటులు పరిగెత్తుకుంటూ వచ్చారు. కాని అప్పటికే విక్రముడు తన

కత్తి దూసి నిలబడి ఉండి, "చావదలచిన వాళ్ళు రండి," అన్నాడు.

రాజభటులు విక్రముణ్ణి చూస్తూనే కొయ్యబారి పోయారు. వాళ్ళకు అతని ప్రతాపం బాగా తెలిసినదే.

మణిపురరాజు పరిస్థితి గ్రహించి వెంటనే కాళ్ళబేరానికి వచ్చాడు.

"ఆగ్రహించకు, విక్రమా! మీ యువ రాజు లక్షణనే పెళ్ళాడగోరితే చేసే దేమున్నది? ఆమెను నీ వెంట పంపుతాను. శాంతించు," అన్నాడాయన. విక్రముడి కత్తి మొన ఆయన గుండెకు జానెడు ఎడంలో ఉన్నది.

రాజు అన్నమాట నిలబెట్టుకుని, వెంటనే లక్షణను ప్రయాణానికి ఆయత్తం చేశాడు. ఆమె మరొక గుర్రం మీద ఎక్కి విభూతి, విక్రముల వెంట బయలుదేరింది.

మధ్యదారిలో చీకటి పడింది. ఆ రాత్రికి వాళ్ళు ఒక చావడిలో పడుకున్నారు. మధ్యలో రాజకుమార్తెను పడుకోనిచ్చి, ఇద్దరు యోధులూ ఆమెకు రెండు పక్కలా, కత్తులూ, ఈటెలూ పక్కనే ఉంచుకుని పడుకున్నారు.

ఒక రాత్రివేళ విక్రముడికి నిద్రాభంగ మయింది. అతను చివాలున లేచి కూర్చుని ఆలకించాడు. అతి వేగంగా పరిగెత్తే గుర్రపు





డెక్కల చప్పుడు చావడిని సమీపిస్తున్నట్టు అతనికి తోచింది. అతను వెంటనే బయటికి సాయుధుడై వచ్చాడు. ఎవరో యోధుడు కవచమూ, శిరస్త్రాణమూ ధరించి, చేత ఈటె పట్టుకుని శరవేగంతో తన కేసి వస్తూం డటం అతనికి కనబడింది.

ఆ యోధుడు సమీపంలోకి వచ్చి గుర్రాన్ని ఆపగానే విక్రముడు, "నీ ప్రాణాలు తీసే ముందు నువ్వెవరో చెప్పు. నా మీదికి ఒంటరిగా వచ్చే గుండె ధైర్యంగల యోధుడు మణిపురంలో ఉన్నట్టు నే నింతవరకూ వినలేదు," అంటూ తన ఈటెతో ఆ వ్యక్తి శిరస్త్రాణాన్ని ఎగదోశాడు.

"మూడేళ్ళపాటు నన్ను రోజూ చూసి కూడా ఇంతలోనే మరిచావా?" అన్నది స్త్రీ కంఠం.

విక్రముడు నివ్వెరపోయి, "లీలావతీ దేవి! ఏమిటిది? ఈ అర్ధరాత్రి—" అంటూ తడుపుకున్నాడు.

లీలావతి గుర్రం మీది నుంచి దిగుతూ, "నాకు పెళ్లి కాకుండా లక్షణ ఒక్కత్తెకూ పెళ్లి చేద్దామనుకున్నావా? ఎంత అధర్మ పరుడివి! నా పెళ్లి కూడా నీ చేతి మీదిగానే జరగనీ!" అన్నది.

"వరుణ్ణి ఎక్కడి నుంచి తెచ్చేది?" అన్నాడు విక్రముడు, మరింత ఆశ్చర్యంతో.

"నువే నన్ను పెళ్ళాడు. నువు నన్ను అడిగినట్టయితే ఏనాడైనా నిన్ను పెళ్ళాడే దాన్ని. నువు అడగలేదు. అందుచేత నేనే నిన్ను అడుగుతున్నాను," అన్నది లీలావతి.

"అంతకన్న అదృష్టమా, లీలావతీదేవీ? తప్పక పెళ్లాడతాను," అన్నాడు విక్రముడు.

తెల్లవారకమునుపే ఇద్దరు యోధులూ, ఇద్దరు రాజకుమార్తెలూ బయలుదేరి తమ నగరాన్ని చేరుకున్నారు.

జయదేవుడు లక్షణను చూసి పరమా నంద భరితుడయాడు. కాని విక్రముడు

లీలావతిని పెళ్ళాడి తనకు తోడల్లుడు కాబోతున్నాడని తెలిసి అతని అతిశయం దెబ్బ తిన్నది.

"నువు నా వదినెగారిని పెళ్ళాడటానికి నేను ఒప్పను. ఆమె కూడా నాతో సమాను డైన వాణ్ణి పెళ్ళాడటం విధి," అన్నాడు జయదేవుడు.

తాను చేసిన ఉపకారానికి యువరాజు ఈ విధంగా కృతజ్ఞత చూపటం విక్రముడికి బాధ కలిగించింది. అతను జయదేవుడితో, "నేను లీలావతీదేవిని పెళ్ళాడటం లేదు, యువరాజా. ఆమే నన్ను పెళ్ళాడుతున్నది. ఆమె కోరిక మీదనే నేనామెను పెళ్ళాడ బోతున్నాను," అన్నాడు.

జయదేవుడు లీలావతితో, మరెవరినైనా భర్తగా ఎన్నుకోమన్నాడు.

"విక్రముణ్ణి మించగల యోధులుంటే పెళ్ళాడటానికి నాకేమీ అభ్యంతరం లేదు," అన్నది లీలావతి.

జయదేవుడు పోటీ పరీక్ష ఏర్పాటు చేశాడు. పోటీ ఏ విధంగా జరగవలసినదీ లీలావతే నిర్ణయించింది.

ఒక పదునైన కత్తిని ఒకచోట నిలువుగా పాతారు. ఇరవై అంగల దూరాన్నుంచి విక్రముడు ములికి లేని బాణాన్ని కత్తి కేసి కొట్టాడు. బాణం రెండు చీలికలయింది. రెండూ ఒకే ప్రమాణంలో ఉన్నాయి.

ఇదే పని చెయ్యటానికి జయదేవుడి పరివారంలోని యోధులందరూ ప్రయత్నించారు. ఒక్కడు కూడా బాణాన్ని చీల్చలేక పోయాడు.

జయదేవుడు లీలావతి విక్రముల పెళ్ళికి ఒప్పుకోక తప్పలేదు. కాని విక్రముడు పెళ్లి అయిన కొద్ది రోజులకే తన భార్యతోసహా మణిపురానికి తిరిగి వెళ్లిపోయాడు. మణిపురరాజు అతన్ని సేనాపతిని చేశాడు. కాల క్రమాన మణిపుర సింహాసనం విక్రముడికే దక్కింది.





# రోగానికి తగిన చికిత్స

పూర్వం కాశ్మీరదేశంలో హిమబిందు అనే మహాపండితు డుండేవాడు. ఆయన అరవై నాలుగు విద్యలలోనూ ఆరితేరినవాడు. ఆయన దగ్గిర శిష్యులుగా చేరి చదువుకున్న వారిలో అన్ని విద్యలవారూ ఉన్నారు. అయినప్పటికీ జ్యోతిషంలో ఆయనకు సాటి లేని పేరుండేది. ఆ కారణంచేత ఆయనకు ఆస్థానంలోనూ, ప్రజలలోనూ గొప్ప పలుకు బడీ, మర్యాదా ఉండేది. దేశంలో ఇంకా ఎందరో గొప్ప పండితు లున్నప్పటికీ, వారంతా హిమబిందు ముందు ఏ మాత్రమూ రాణించేవారు కారు. అందుచేత వారికి అయన మీద చాలా ఈర్ష్యగా ఉండేది.

కాశ్మీరు రాజు మందమతి. అతనికి కాస్త తలతిక్క కూడా ఉండేది. చెప్పుడు మాటలు విని అప్పుడప్పుడూ అవివేకపు పనులు చేసేవాడు. హిమబిందు అంటే గిట్టని పండితులందరూ ఒకసారి కూడ బలుక్కుని రాజు వద్దకు వెళ్ళి, "మహా రాజా, ఈ హిమబిందుతో చావొచ్చిపడింది. తనకు తెలియని శాస్త్రం లేదని లోకాన్ని నమ్మించాడు. ఎవడైనా, తాను హిమబిందు శిష్యుడినంటే చాలు, వాడికి బ్రహ్మరథం పడుతున్నది లోకం," అంటూ అంతులేని చాడీలు చెప్పారు.

ఇదంతా విన్నమీదట రాజుకు హిమ బిందును పరీక్షించా లనిపించింది. అతనికి ఎలాంటి పరీక్ష పెట్టాలో, అది కూడా పండి తులే చెప్పారు.

మర్నాడు రాజు హిమబిందును తన దర్బారుకు పిలిపించి, ముగ్గురు వ్యక్తులను హిమబిందుకు చూపించాడు. వారిలో ఒకడు వెర్రిబాగులవాడు. రెండవవాడు జన్మతః చెవిటీ, మూగా కూడా. మూడవది స్త్రీ. ఆమె పుట్టు గుడ్డిది. మొదటివాణ్ణి పండితుణ్ణి చెయ్యమనీ, రెండవవాడికి మూగతనమూ,

అజ్జరపు హనుమంతరావు

చెపుడూ పోగొట్టమనీ, మూడవవాన్ని నాట్య గత్తెనుగా తయారు చెయ్యమనీ రాజు హిమబిందును ఆదేశించాడు.

రాజుగారి మాటలు విని హిమబిందు నిర్ఘాంతపోయాడు.

"ఈ మూడుపనులూ చెయ్యటానికి ఎంత కాలం పడుతుంది?" అని రాజు హిమ బిందును అడిగాడు.

"మూడు మాసాలకు తక్కువ పట్టదను కుంటాను," అన్నాడు హిమబిందు.

"మూడు మాసాలు చాలునా?" అన్నాడు రాజు ఆశ్చర్యంతో.

"చాలు, మహారాజా. ఒక నెలపాటు వీరి హస్తరేఖలూ, లలాటరేఖలూ, గ్రహాల బలా బలాలూ పరీకించాలి. అటుపైన శిక్షణ కైనా, చికిత్సకైనా రెండుమాసాలు చాలు," అన్నాడు హిమబిందు.

"సరే. మూడునెలల అనంతరం కనిపిం చండి. అప్పటికి ఈ మూడు పనులూ పూర్తికాని పక్షంలో మీకు దేశబహిష్కరణ జరుగుతుంది. అ సంగతి గుర్తుంచుకోండి," అన్నాడు రాజు.

ఒక నెల గడిచాక హిమబిందు ఆ ముగ్గు రినీ వెంట బెట్టుకుని రాజుగారి దర్బారుకు హాజరయాడు.



"వీళ్ళ హస్తరేఖలూ, లలాట రేఖలూ, పరీకించారా?" అని రాజు ఆయన్ని అడిగాడు.

"పరీకించాను, మహారాజా. వాటిలో ఒక్కటి కూడా వీళ్ళకు అనుకూలంగా లేదు. ముఖ్యంగా గ్రహాలు అనుకూలించ నప్పుడు నా ప్రయత్నం ఎందుకూ పనికి రాదు," అన్నాడు హిమబిందు.

"అయితే మీరు ఓడిపోయినట్టేనా?" అని రాజు అడిగాడు.

"నేను ఓడి పోనవసరం లేదు. మంత్ర తంత్ర శాస్త్రాలలో గ్రహగతులను తప్పించే ప్రక్రియలు లేకపోలేదు. అలాటి పనులు మన మహర్షులు అనేకసార్లు చేశారు.



53

లలాట రేఖలను కూడా అవలీలగా మార్చ వచ్చు. సత్యవంతుడి లలాట లిఖితాన్ని సావిత్రి మార్చలేదా? తమ సెలవైతే నేను మహావ్రతం ప్రారంభించి గ్రహగతులను మార్చేస్తాను," అన్నాడు హిమబిందు.

"గ్రహాల గతులు మార్చటానికి నా అనుమతి దేనికీ?" అన్నాడు రాజు.

"ఇది అంత తేలికైన విషయం కాదు. నేను గ్రహగతులను మార్చే వ్రతం పరిసమాప్తి అయేలోగా వెయ్యిమంది సుక్షత్రియ యువకులనూ, వెయ్యి మేలు జాతి గోవులనూ బలి ఇచ్చి గ్రహశాంతి చేయవలసి ఉంటుంది. అంతకన్న కూడా గొప్ప ప్రమాదం ఒకటి ఉన్నది. తమ లాటి గొప్ప జాతకులకు ఉచ్చలో ఉండి, కాపాడుతున్న గ్రహాలు తమ గతులు మారినాక నీచలో పడి, దారుణమైన కష్ట నష్టాలను కలిగించ వచ్చు. ఈ మహాసభలో ఎందరో అదృష్ట జాతకులున్నారు. వారంతా ఆమోదించి నట్టయితే నా వ్రతాన్ని ఇవాళే ప్రారంభిస్తాను," అన్నాడు హిమబిందు.

ఈ మాటలు వినగానే రాజుకు కాళ్ళూ, చేతులూ చల్ల బడ్డాయి. సభలో చాలా మందికి దడ పుట్టుకొచ్చింది. హిమబిందు అసాధారణ శక్తి మంతుడన్న నమ్మకం అందరికీ ఉన్నది. ఆయన జాతకాలు చూసి కోటీశ్వరులు బికారులై పోతారని చెబితే అక్షరాలా జరిగింది. ఆయన వైద్యం చేస్తే చావటానికి సిద్ధంగా ఉన్న వాళ్ళు లేచి తిరిగారు. అందుచేత ఆయన నోటిమాటంటే అందరికీ గురి.

మంత్రి రాజు చెవిలో ఏదో ఊదాడు. రాజు హిమబిందు కేసి తిరిగి, "సరే, అయితే ప్రస్తుతానికి ఈ ముగ్గురినీ వాళ్ళ గ్రహచారానికి వదిలెయ్యండి," అన్నాడు. తరవాత ఆయన ఆనవాయితీ ప్రకారం హిమబిందుకు కానుకలు ఇచ్చి, ఆయన మీద చాడీలు చెప్పిన వారిని దేశం నుంచి పంపేశాడు.





# బయటపడని నేరం

మాహిష్మతీపురానికి మహీధవుడు రాజు. అతని భార్య సౌరభ. భార్య అంటే రాజుకు ఎంతో అభిమానం. ఆమె మనసు ఏ మాత్రం నొచ్చుకున్నా అతను అమితంగా బాధపడే వాడు. అందుచేత అతను ఆమె మనసు కష్ట పెట్టే పనులు జరగకుండా చాలా జాగ్రత్త పడేవాడు. ఒకవేళ ఏ కారణం చేతనన్నా తన మనసుకు బాధ కలిగినా, సౌరభ ఆ విషయాన్ని తన భర్తకు తెలియ నిచ్చేది కాదు.

మాహిష్మతీ నగరానికి సమీపంలోనే అశ్వముఖ మనే చిన్న కొండ ఉన్నది. ఆ కొండ మీది ప్రకృతి దృశ్యాలు ఎంతో సుందరంగానూ, ఆనందదాయకంగానూ ఉండేవి. అందుచేత రాజు తరచు అక్కడికి వాహ్యాళి వెళ్ళేవాడు. ఆ ప్రదేశం ఎంత మనోహరంగా ఉండేదంటే, గంధర్వులూ, ఖేచరులూ, కిన్నరులూ, కింపురుషులూ తరుచుగా ఆ కొండ మీద దిగి విహారాలు చేస్తూండేవాళ్లు.

అలా విహారం చెయ్యటానికి అశ్వముఖం మీదికి వచ్చిన ఒక గంధర్వస్త్రీ అక్కడ మహీధవుణ్ణి చూసి మోహించింది. ఆమె అతని ఎదట ప్రత్యక్షమై, తానెవరో తెలుపు కుని, కొంతకాలం తనను భార్యగా ఏలుకో మని అతన్ని వేడుకున్నది. కాని సౌరభకు సపతిని తెచ్చి పెట్టటం ఇష్టంలేక రాజు గంధర్వస్త్రీ కోరికను నిరాకరించి, తన నగ రానికి వెళ్లిపోయాడు.

రాజుకు సౌరభ పట్ల అంతటి గౌరవం ఉన్నప్పటికీ, అతను మరొక భార్యను చేసుకోక తప్పలేదు. అది ఎలా జరిగిందంటే:

రాజు సౌరభతో పదేళ్లు కాపరం చేసినా కూడా వారికి సంతానం లేదు, కలిగే సూచన లైనా లేకపోయాయి. రాజ్యానికి మరొక నాథుడు కావాలి, రాజవంశం నిలపటానికి

ఎ. గంగాధర్



వారసుడు కావాలి. మంత్రులు మొదలైన వారు రాజును మరొక భార్యను చేసుకోమని సూచనలు ఇస్తూనే ఉన్నారు, కాని రాజు వాటిని లక్ష్యపెట్టలేదు. చివరకు వాళ్ళు ఈ విషయమై పట్టుబట్టారు. రాజు మరొక భార్యను చేసుకోక పోవటానికి కారణం సౌరభేనని వాళ్ళకు తెలుసు గనక ఆమెతో కూడా గట్టిగా చెప్పారు.

"సంతానం కోసం నన్ను మళ్ళీ పెళ్ళాడమని మంత్రులు చాలా వేధిస్తున్నారు," అని రాజు సౌరభతో అన్నాడు.

"వాళ్లు మన మంచికోరే చెబుతున్నారు. వాళ్లు చెప్పినట్టే చెయ్యండి. నా కోసం వంశం అంతరింప జేసుకోకండి. నాకు వంశ నిర్మూలిని అనే అపఖ్యాతి కూడా వచ్చేస్తున్నది," అన్నది సౌరభ.

రాజు సరేననటం వ్యవధిగా మంత్రులు అతనికి కుంతల రాజకుమార్తె అయిన పయస్వినిని తెచ్చి పెళ్లిచేశారు.

పదేళ్ళపాటు తన భర్త నెత్తిమీది దేవతలాగా జీవించిన సౌరభకు చాలా మనఃక్లేశం కలిగింది. కాని ఆమె దాన్ని తనలోనే అణచుకున్నది.

అయితే పయస్విని గవర్భవతి అయి, వివాహం జరిగిన ఏడాదికల్లా మగపిల్లవాణ్ణి కన్నది. దానితో సౌరభకు నరకంలో పడిపోయినట్టయింది. పయస్విని భావి రాజమాత. సౌరభకు ఎలాటి భవిష్యత్తూ లేదు.

సౌరభకు మతిపోతున్నట్టయింది. పయస్వినిని తన భర్త పెళ్ళాడిన ప్రయోజనం సిద్ధించింది. ఇంక ఆమె తన కడ్డంగా దేనికి? రాజు ఆమెను వదిలెయ్యవచ్చు. కాని అందుకు ఎవరూ ఒప్పుకోరు. అందుచేత పయస్విని చచ్చిపోవాలని సౌరభ నిశ్చయించుకున్నది. ఆమెకు యుక్తాయుక్త విచక్షణ కూడా పోయింది. పయస్విని ఇంకా బాలింతరాలుగా ఉండగానే, ఒక నాటి రాత్రి సౌరభ ఆమెకు పాలలో విషం

కలిపి తాగించింది. పయస్విని ఆ పాలు తాగి మరణించింది.

పయస్విని చనిపోయాక సౌరభకు పూనకం దిగిపోయినట్టయింది. తాను చేసిన పని కిరాతకమైనదనీ, తన సవతిని హత్య చేసి తన భర్తతో ఏమీ జరగనట్టు సుఖించడం తనకు సాధ్యమయే పని కాదనీ గ్రహించి, సౌరభ ఆత్మహత్య చేసుకొన నిశ్చయించింది. ఆమె అర్ధరాత్రివేళ రాజ భవనం మిద్దె మీదికి వెళ్ళి అక్కడి నుంచి కింద పడబోయింది.

కాని ఎవరో ఆమెను వెనక నుంచి పట్టుకుని ఆపారు. సౌరభ కంగారుపడి వెనక్కు తిరిగి చూస్తే, పయస్విని! పయస్విని దయ్యమై వచ్చిందనుకుని సౌరభ భయంతో కొయ్యబారి పోయింది. దయ్యం అయితే తనను ఎందుకు కాపాడుతున్నదీ సౌరభకు అర్థం కాలేదు.

"భయపడకు, అక్కా. నేను చావలేదు. నాకు చావు లేదు. నువు నాకు విషం ఇచ్చిన మాట నే నెవరికీ చెప్పనులే. ఎప్పటిలాగే సంతోషంగా ఉందాం, రా!" అన్నది పయస్విని.

సౌరభ విచారమంతా పోయింది. ఆమె మనస్సు తేలికన పడింది. తాను చేసిన




పొరపాటుకు పశ్చాత్తాప పడుతున్నదానిలాగా ఆమె పయస్వినిని రాజు కన్న కూడా హెచ్చు ఆదరంతో చూడసాగింది. ఆమె రాజు ప్రేమ కోసం అర్రులు చాచటం మానేసింది కూడా.

రాజుకు కూడా పయస్విని మీద మమకారం పెరగసాగింది. ఆమెలో ఏదో ప్రబలమైన ఆకర్షణ శక్తి ఉన్నట్టు అతనికి అనిపించింది. అతని కిప్పుడు సౌరభ దాదాపు జ్ఞాపకమే రావటం లేదు. అతను అశ్వముఖానికి విహారార్థం వెళితే పయస్వినినీ, తన కుమారుణ్ణీ కూడా వెంట తీసుకుపోతూ ఉండేవాడు.



57

కుమారుడు పుట్టి అయిదారేళ్లు గడిచాయి. రాజూ, పయస్వినీ, కుమారుడూ అశ్వముఖం మీద విహరిస్తున్నారు. ఇంతలో రాజకుమారుడు, చెట్ల మధ్యగా ఎగిరే పక్షి నొకదాన్ని తల ఎత్తి చూస్తూ నడిచి వెళ్లి, కొండ చివర నుంచి జారి కింది లోయలోకి పడిపోయాడు.

రాజు పెద్దగా కేక పెట్టాడు. మరుక్షణమే పయస్విని పరిగెత్తుకుంటూ వెళ్లి కొండ అంచు నుంచి కిందికి దూకేసింది. కొద్ది క్షణాల వ్యవధిలో తన కొడుకునూ, భార్యనూ పోగొట్టుకుని, భయ దుఃఖాలతో కట్టెలాగా అయి పోయిన రాజు, కుమారుణ్ణి క్షేమంగా చేతుల్లో పట్టుకుని పయస్విని లోయలో నుంచి కొండ పైకి వస్తూండటం చూసి నిర్ఘాంతపోయాడు.

పయస్విని రాజును సమీపించి, రాజకుమారుణ్ణి దించి, దొరికిపోయిన దొంగలాగా రాజు ముందు తలవంచుకుని నిలబడింది.

"ఎవరు నువ్వు? నిజంగా పయస్వినివేనా? నా భార్యవేనా?" అని రాజు ఆమె నడిగాడు.

ఆమె తల ఎత్తి, "నేను పయస్వినిని కాను. ఒకప్పుడు నిన్ను మోహించి, వరించిన గంధర్వస్త్రీని. నీ భార్య పయస్విని చచ్చిపోయి అయిదేళ్ళయింది. వెంటనే నే నామె శరీరంలో ప్రవేశించి, నీ కొడుక్కు తల్లిలేని కొరత తీర్చాను, దానితో బాటు నా చిరకాల వాంఛ కూడా తీర్చుకుని, నీకు అయిదేళ్ళపాటు భార్యగా ఉన్నాను. నీ పెద్ద భార్య యోగినిలాగా జీవిస్తున్నది. వెళ్లి ఆమెతో సుఖంగా ఉండు," అన్నది.

మరుక్షణం పయస్విని పడిపోయింది. ఆమెలో జీవం లేదు.

రాజు తన కొడుకుతో తిరిగి వచ్చి, సౌరభ మీద ఎప్పటిలాగే ప్రేమగా ఉంటూ రాజ్యం ఏలుకున్నాడు.





# లోకభీతి-పాపభీతి

శబరవాడి అనే గ్రామంలోని దేవాలయానికి శంకరారాధ్యు డనే బ్రాహ్మణుడు అర్చకుడుగా ఉండేవాడు. ఆయన ఎంతో దైవ భక్తిపరుడు. సహజంగా ఊళ్ళో ఆయనకు మంచి గౌరవం ఉండేది.

శంకరారాధ్యుడు చీకటితోనే లేచి నదికి స్నానానికి వెళ్ళి, అక్కడ ఉన్న కూర మళ్ళలో నుంచి తనకు కావలిసిన కూర గాయలు కోసుకుని, ఇంటికి తీసుకుపోయి, భార్య కిచ్చి, ఆ తరవాతనే దేవాలయానికి వెళ్ళేవాడు.

ఇలా కూరలు తీసుకోవటం దొంగతన మని ఆయన అనుకోలేదు. కూరల తోట వాడు ఆయనకు కావలిసిన కూరలు సంతోషంగా ఇస్తాడు. అయితే అంత చీకటితో మళ్ళలో ఎవరూ ఉండరు. అందుచేత ఆయన ఆ కూరలను అడిగి తీసుకునే అవ కాశంలేదు.

ఇదే చివరకు ప్రమాదంగా పరిణమించింది. కూరల తోటవాడికి తన తోటలో దొంగతనం జరుగుతున్నట్టు అనుమానం తగిలింది. వాడు ఒక రాత్రి తోటలో మాటు వేసుకు కూర్చున్నాడు. తెల్లవారు ఝామున శంకరారాధ్యుడు యథాప్రకారం స్నానానికి వచ్చి, తోటలోకి అడుగుపెట్టి, నాలుగైనాలుగు వంకాయలు కోసుకున్నాడు. కాయలు తెంపుతున్న చప్పుడు తోటవాడికి వినిపించింది. మసక వెలుతురులో వాడు పూజారిని గుర్తించక, వెనక నుంచి వచ్చి, దుడ్డుకర్రతో బలంగా కొట్టాడు.

"శివ శివా!" అంటూ పూజారి స్పృహ తప్పి పడిపోయాడు.

దెబ్బతిని పారిపోతాడనుకున్న దొంగ అక్కడే కుప్పకూలి పోయేసరికి తోటవాడు ఆశ్చర్యపడి దగ్గిరికి వచ్చి చూస్తే, దొంగ పూజారేనని తెలిసింది. అంతేకాదు, తాను

అర్. సత్యనారాయణ




కొట్టిన దెబ్బకు పూజారి చచ్చిపోయినట్టుం కూడా కనిపించాడు. ఆయనలో చలనం లేదు. ముక్కు దగ్గిర వేలుపెట్టి చూస్తే శ్వాసకూడా ఆడుతున్నట్టు లేదు.

తోటవాడు కొయ్యబారిపోయాడు. పూజారిని దొంగ అనుకోవటమే అపచారం. ఆయనను చావగొట్టటం మహాపచారం. ఈ సంగతి ఊళ్ళో తెలిస్తే తనను బతకనివ్వరని ఊహించి తోటవాడు ఆ క్షణంలోనే ఊరు విడిచి పారిపోయాడు.

అయితే పూజారి చావలేదు. తోటవాడు కొట్టిన దెబ్బ ఆయన వీపు పైన పడి ప్రాణం దిమ్మరపోయింది. చల్లగాలికి ఆయన క్రమంగా తేరుకున్నాడు. తన పరిసరాలు చూసుకున్నాక ఆయనకు జరిగినది జ్ఞాపకం వచ్చింది. తోటలో కాయలు కోసుకుంటున్నందుకు తనను తోటవాడు కాబోలు కొట్టాడు. వాడి జాడ కనిపించటంలేదు. తన దొంగతనం గురించి ఊళ్ళోవాళ్ళందరికీ చెప్పి, తనను చూపించటానికి వెళ్ళి ఉంటాడు! పరువుగా బతుకుతున్న తనకు దొంగ అనే పేరు వస్తుంది! ఇక తాను ఊళ్ళో తల ఎత్తుకు తిరగలేడు సరేకదా, తనకు ఇన్ని మంచి నీళ్ళు కూడా పుట్టవు.

ఇలా అనుకుని శంకరారాధ్యుడు కూడా గ్రామం విడిచి పరారీ అయిపోయాడు. అప్పటికి తూర్పు తెల్లవారుతున్నది.

పూజారి భార్య ఝాము పొద్దెక్కేదాకా భర్త కోసం ఎదురు చూసి, ఇరుగుపొరుగు వాళ్ళతో చెప్పింది. చీకటితో స్నానానికి వెళ్ళిన పూజారి ఇంకా తిరిగి రాలేదు. దేవాలయానికి తిన్నగా వెళ్ళాడేమో నను కుంటే అక్కడా లేడు. స్నానాలరేవు వద్ద వెతికితే పూజారి ఉపయోగించే చెంబు తోటకు సమీపంలో కనబడింది. అందుచేత ఆయన ప్రమాదవశాన లోతు నీటిలోకి వెళ్ళి, నదిలో కొట్టుకునిపోయి ఉంటాడని గ్రామస్థులు అనుకున్నారు.

కాని ఇంతలో మరొక విషయం బయట పడింది. అదేమిటంటే, తోటవాడు ఉదయం నుంచీ కనిపించటంలేదు. తోటలో ఒక మూల పెంటపోగు కాలుతున్నది. దాన్ని కుళ్ళగించి చూస్తే కాలిన ఎముకలేవో కనపడ్డాయి.

తోటవాడు పూజారిని హత్యచేసి పెంట కుప్పలో పెట్టి నిప్పు అంటించి, ఎక్కడికో పరారీ అయి పోయాడని గ్రామస్థులు నిశ్చ యించు కున్నారు.

తోటవాడి మీద హత్యానేరం అరోపించ బడింది. వాణ్ణి పట్టుకునేందుకు రాజభటులు అంతటా వెతుకుతున్నారు.

ఒక సంవత్సరం గడిచింది. ఈ లోపుగా తోటవాడు బైరాగి వేషం వేసుకుని చాలా దేశం తిరిగాడు. వాడికి తన పెళ్ళాం పిల్లల మీద గాలి మళ్ళింది. అందుచేత సాహ సించి వాడు తన గ్రామానికే వచ్చి, ఊరి సత్రంలో చేరి, వాళ్ళూ వీళ్ళూ అనుకునే మాటలనుబట్టి, తాను పూజారిని హత్య చేసి నట్టూ, పూజారి శవాన్ని చెత్తకుప్పలో పెట్టి కాల్చినట్టూ ఊళ్ళోవాళ్ళు అనుకుం టున్నట్టు తెలుసుకున్నాడు. పూజారి శవాన్ని చూసినవాళ్ళు ఎవరూ లేరు. అంటే పూజారి చావలేదన్నమాట. తాను పారిపోయాక పూజారి లేచి ఎటో వెళ్ళిపోయాడు.



పూజారి ఎక్కడ ఏ రూపంలో ఉన్నా పట్టుకోవాలని తోటవాడు నిశ్చయించుకుని ఊరూరూ తిరుగుతూ, కనిపించిన సన్యాసి నల్లా, బైరాగి నల్లా పరీక్షగా చూడసాగాడు.

ఈలోపల పూజారి కూడా సన్యాసి వేషం ధరించి తీర్థయాత్రలు చేసి, చివరకు ఇంటి మీద గాలిమళ్ళి, ఇంటి దారి పట్టాడు.

ఒకనాడు ఒక ఊరి సత్రంలో ఇద్దరూ తారసిల్లారు. తోటవాడు పూజారిని సమీపించి, "మీ పేరు శంకరారాధ్యులుకాదూ? తమరు ఈ మారు వేషంలో ఎందుకు తిరుగుతున్నట్టు?" అని అడిగాడు.

పూజారి నిర్ఘాంతపోయి, ఆ బైరాగి త్రికాలజ్ఞు డనుకుని, "అయ్యో, నేను కూరగాయలు దొంగతనం చేసి, తోటవాడిచేత చావు దెబ్బతిని, గౌరవంగా బతికిన చోట దొంగ అనే అప్రతిష్ఠ తెచ్చుకోవటం ఇష్టం లేక, ఇలా దేశసంచారం చేస్తున్నాను," అని చెప్పాడు.

"అయ్యో, నేనే ఆ తోటవాణ్ణి. తమరని తెలీక కర్ర విసిరాను. ఆ పాడు పని చేసినందుకు అనుభవిస్తున్నాను. నేను మిమ్మల్ని హత్య చేశానని పుకారుపుట్టింది. మీరు కూరలు దొంగిలించారని ఎవరూ కలలోకూడా అనుకోలేదు. కాని నా కోసం రాజభటులు కారాడుతున్నారు. మీరు ప్రాణాలతో గ్రామంలో కనిపిస్తేగాని నామీద నుంచి ఈ ఆరోపణ పోదు. నేను నా భార్యాబిడ్డలను చూసుకోవాలని తహ తహ లాడిపోతున్నాను. పదండి, మన ఊరు పోదాం!" అన్నాడు తోటవాడు.

ఇద్దరి సమస్యా తీరిపోయింది. ఇద్దరూ కలిసి గ్రామానికి తిరిగి వచ్చారు. దైవప్రేరితంగా తమ కిద్దరికీ ఒకేసారి తీర్థయాత్రలు చెయ్యాలనిపించిందనీ, ఆ పని ముగించుకుని తిరిగి వస్తున్నామనీ వాళ్ళు గ్రామస్థులతో చెప్పారు. గ్రామస్థులు నిజమే కాబోలనుకున్నారు.





# కృష్ణావతారం

బలి కుమారుడు బాణాసురుడు. అతని రాజధాని శోణపురం. వెయ్యిచేతులు గల బాణుడు చిన్నతనంలో తెగ తిరిగాడు. ఒకనాడు అతను, మణులతోనూ, బంగారంతోనూ ప్రకాశించే కుబేరపర్వతపు గుహలో కుమారస్వామి ఆటలలో మునిగి ఉండటమూ, శివపార్వతులు వినోదించుతూ ఉండటమూ చూశాడు.

కుమారస్వామి ఆరు ముఖాలూ, చేతులూ, శరీరచ్ఛాయా, తేజస్సూ చూసి బాణుడు, "ఈ కుర్రవాడు ఏ తపస్సు చేసి శివుడికి కొడుకై జన్మించాడో గదా! నేను కూడా అలాగే తపస్సు చేసి ఈ మహా దృష్టాన్ని సాధించాలి," అనుకున్నాడు. అలా అనుకున్న బాణుడు ఏకాగ్రభక్తితో అనేక సంవత్సరాల పాటు నిష్ఠగా శివుణ్ణి ఆరాధించాడు. శివుడు అతని ఆరాధనకు సంతోషించి, పార్వతీసమేతుడై బాణుడి ఎదట ప్రత్యక్షమై, చిరునవ్వు నవ్వుతూ, "నాయనా, నీ ఇష్టంవచ్చిన వరం కోరుకో, ఇస్తాను," అన్నాడు.

బాణుడు చేతులు మోడ్చి, "దేవా, నే నీ దేవికి కొడుకునై, నీ అనుగ్రహానికి పాత్రుణ్ణి అయేటట్టు వరం ఇయ్యి," అని అడిగాడు.

శివుడు సరేనని, పార్వతిని చూసి, "దేవీ, వీడు బాణుడు. నీ చిన్నకొడుకు. కుమారస్వామికి రెండోవాడు. వీణ్ణి గ్రహించు," అన్నాడు. తరవాత శివుడు బాణుడికి, సమస్త సంపదలతోనూ తులతూగే శోణ



పురాన్ని రాజధానిగా ఇచ్చి, "నీ నగరాన్ని నేను స్వయంగా కాపాడుతూ ఉంటాను. నిన్ను ఎంతటివాడూ జయించలేడు. అందు చేత నువు నిశ్చింతగా ఉండు," అన్నాడు.

కుమారస్వామి బాణుడికి ఒక దివ్యమైన నెమలిని ఇచ్చి, "ఈ నెమలే నీకు వాహనమూ, పతాక కూడా అయి ఉంటుంది," అని చెప్పాడు.

ఇక బాణుడికి ఎవరి భయమూ లేదు. ఎందుకంటే, శివుడే తనకు రక్ష. అతను విజృంభించి దేవతలనూ, గంధర్వులనూ, నాగులనూ, ఖేచరులనూ, రాక్షసులనూ, సమస్తమైన వారినీ ఒకరి తరవాత ఒక



రినిగా జయించి, యుద్ధం చెయ్యాలనే ఆసక్తి తీరక, తనతో యుద్ధం చెయ్యగల వాళ్లు కానక తపించిపోయాడు.

అనేక సంవత్సరాలు ఇలా గడిచిన మీదట అతని చేతుల తీట దుర్భరమయింది. అతను శివుడి వద్దకు వెళ్ళి, సాష్టాంగపడి, భక్తిగా పూజ చేసి, "దేవా, నాకు యుద్ధం కరువైపోయింది. నా చేత అనేకసార్లు ఓడిపోయిన దేవతలు నా ఎదట పడకుండా ఉన్నారు. నాతో యుద్ధం చెయ్యటానికి సిద్ధంగా ఉన్న శూరుడు మూడు లోకాలలోనూ ఒక్కడైనా కానరాడు. నా చేతులన్నీ వ్యర్థంగా ఉండిపోయాయి. ప్రదర్శించటానికి లేని పరాక్రమం వృథా కదా! నాకు యుద్ధం చేసే అవకాశం ఎలా కలిగేదీ తెలిపి అనుగ్రహించు," అని వేడుకున్నాడు.

శివుడు బాణుణ్ణి చూసి నవ్వి, "నువ్వడిగినది నేను కాదనటం భావ్యంకాదు గద. విను. నీ మయూరధ్వజం ఏ కారణమూ లేకుండా ఒరిగి, పడిపోయినప్పుడు నువు కోరుకుంటున్న యుద్ధం నీకు సన్నిహితమవుతుందనుకో. అప్పుడు నీ బాహుబలానికి తగినటువంటి యుద్ధం సంభవిస్తుంది. విచారించకు," అన్నాడు.





"అమ్మయ్య, బతికిపోయాను," అని బాణుడు శివుడికి మొక్కి, సెలవు తీసుకుని, తన యింట నెమలిధ్వజం ఉన్న చోటికి వెళ్ళి కూర్చుని, సభ జేసి, తన మంత్రి అయిన కుంభాండుడితో, "ఒక మంచి వార్త తెచ్చాను," అన్నాడు.

దానికి కుంభాండుడు, "మంచి వార్తలు చాలా ఉంటాయి. అందులో ఇది ఏది? నీకు శివుడు కొత్తవరం ఏదన్నా ఇచ్చాడా? లేకపోతే, ఇంద్రుణ్ణి పాతాళానికి పంపేసి, దేవలోకాన్ని నిన్నే ఏలుకోమన్నాడా? అదీ కాకపోతే, కృష్ణుణ్ణి గెలిచే ఉపాయం గాని చెప్పలేదు గద? అదే జరిగితే ఇంక లేనిదేమిటి? విష్ణుడి చేత మోసపోయి పాతాళం చేరిన పరమ ధర్మాత్ముడు నీ తండ్రికి విముక్తి కలుగుతుంది. ఆయనను మళ్ళీ చూచి ధన్యులమవుతాం," అన్నాడు.

బాణుడు చిన్నగా నవ్వుతూ, "కాదు, కుంభాండా! యుద్ధాలు లేని కారణం చేత నా చేతులు దురదగా ఉండి, నాకు యుద్ధం చేసే అవకాశం ఎలా కలుగుతుందని శివుణ్ణి వేడుకున్నాను. నా యీ మయూరధ్వజం అకారణంగా ఎప్పుడు పడిపోతే అప్పుడు నాకు తగిన యుద్ధం రాబోతుందనుకోమని ఆ మహాదేవుడు



చెప్పాడు. అదే నీకు నేను చెబుదామనుకున్నాను," అన్నాడు.

కుంభాండుడు చిన్నబోయి, "అయ్యో, ఇదేం ప్రారబ్ధం! ఇదా నువు మహాశివుణ్ణి అడిగిన వరం? ప్రహ్లాదుడి కులానికెంత దుస్థితి వచ్చింది!" అన్నాడు.

అతనా మాట అంటూండగానే పెళపెళా రావాలతో మయూరధ్వజం, వజ్రాయుధం దెబ్బతిన్న కొండ లాగా, ఒరిగి పడిపోయి, బాణుడూ, కుంభాండుడూ చూస్తుండగా విరిగిపోయింది. తన కోరిక ఈడేరుతున్నదని బాణుడు పరమానందభరితుడయాడు. అదే క్షణంలో భూమి కంపించటమూ, ఆకా





శాన తోకచుక్క కనబడటమూ, ప్రచండంగా గాలి వీచటమూ, శోణపురం మీద రక్తవర్షం కురవటమూ, మొదలైన ఉత్పాతాలు కలిగాయి.

వాటిని చూసి కుంభాండుడు బెదిరిపోయి, తనలో, "మూడులోకాలనూ గెలిచి, తన ఎదట నిలిచేవాడు లేకుండా చేసుకున్న బాణుడు, గర్వాతిశయం కొద్దీ యుద్ధం వరంగా తెచ్చుకున్నాడు. ఎంత పొరపాటు! ఇది ఇతని నాశనానికే వచ్చింది. ఎంత మంచివాడిలోనైనా రాక్షసబుద్ధి రాక్షసబుద్ధే! ఈ ఉత్పాతాలన్నీ ఊరికే పోతాయా? శివుడూ, కుమారస్వామీ నగరాన్ని రక్షిస్తున్నప్పటికీ వరం మూలాన లభించిన యుద్ధం తప్పదు. అయితే బాణుణ్ణి ఎదిరించి నిలబడగల వాళ్ళు లేరు—దేవతల పరాజయం సహించలేని విష్ణువు తప్ప," అనుకున్నాడు.

బాణుడు మాత్రం నిశ్చింతగానూ, ఉత్సాహంగానూ, సమస్త భోగాలలోనూ మునిగితేలుతూ, విష్ణువుతోనైనా సరే యుద్ధం చెయ్యటానికి సంసిద్ధుడై ఉన్నాడు.

బాణుడికి ఉష అనే కుమార్తె ఉన్నది. చంద్రుడి కళలే స్త్రీ రూపం ధరించాయా అనిపించేటంతటి సౌందర్యవతి. ఆమెకు చెలికత్తె అయిన చిత్రరేఖ కుంభాండుడి కూతురు. తండ్రి ఆదేశించిన మీదట ఉష తనకు తగిన భర్త లభించాలని పార్వతీ దేవిని ప్రార్థిస్తూ ఉండేది.

ఇంతలో చైత్రమాసం వచ్చింది. శోణ నగరంలోనే ఉంటున్న శివుడు పార్వతితో కూడా వసంతవిహారాలు చేయ నిశ్చయించి, అనేకమంది అప్సరసలనూ, గంధర్వ స్త్రీలనూ రప్పించాడు. స్త్రీలను పార్వతి రూపాలు ధరించమన్నాడు. ప్రమథగణాలను శివశక్తి రూపాలు ధరించమన్నాడు. అందరూ కలిసి శోణపురం వెలపల, మందాకినీ నది ఒడ్డున గల తోటలలో ఆటలూ,





వినోదాలూ, వేడుకలూ సాగించారు. నృత్య గానాలు సాగాయి.

మహా ఉల్లాసంగా సాగే ఈ వినోదాల మధ్య శివపార్వతులు ఆలింగనం చేసుకోవటం ఉష చూసింది. వెంటనే ఆమెకు తన భర్తను తాను కౌగలించుకునే అదృష్టం ఎప్పుడు కలుగుతుందా అనిపించింది. తన కేమి లోటు? తన తండ్రి మూడు లోకాలూ ఏలేవాడు. సాక్షాత్తూ పార్వతీదేవే తన ఇలవేల్పు. తనకు తగిన భర్తను ప్రసాదించమని తాను పార్వతిని నిత్యమూ ప్రార్థిస్తున్నది. అయినా తన కోరిక ఎందుకు తీరటం లేదు?



ఈ విధంగా ఉష తన మనస్సులో అనుకోవటం పార్వతి గ్రహించి, చెయ్యి ఊపి ఆమెను తన దగ్గిరికి పిలిచి, "బాలా, నీ మనసులో ఉన్న ఆలోచన సరిఅయినదే. కన్యలు భర్తల కోసం తపించటం తప్పు కాదు. త్వరలోనే నీకు భర్త దొరుకుతాడు. శివుడితో నేను పొందే సౌఖ్యాన్ని నువు కూడా పొందుతావు. అది ఎలా జరిగేదీ చెబుతాను, విను. వచ్చే వైశాఖ శుద్ధద్వాదశి రాత్రి నువు నిద్రపోతూండగా ఒక పురుషుడు కలలో వచ్చి నిన్ను కలుస్తాడు. అతనే నీకు కాబోయే భర్త," అన్నది.

ఉష సంతోషంతోబాటు సిగ్గుపడుతూ, పార్వతికి మొక్కి వెళ్ళిపోయింది.

పార్వతి చెప్పినట్లే జరిగింది. ఒకనాటి రాత్రి ఉష తన చెలికత్తెలతో సహా మేడ మీద సుఖనిద్రలో ఉండగా ఆమెకు కల వచ్చింది. అందులో ఒక మన్మథాకారుడు ఆమెను సమీపించి, నవ్వుతూ ఆమెను పలకరించి, ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుని, ఆమెను కౌగలించుకుని, సుఖాలలో ముంచి ఎత్తాడు.

ఉష అదిరిపాటుతో నిద్ర లేచింది. కళ్లు తెరిచి చూస్తే ఎవరూ లేరు. కాని జరిగినది కలలాగా లేదు, చాలా వాస్తవంగా ఉన్నది.

ఆమెకు భయమూ, సిగ్గూ కలిగాయి. ఆమె పార్వతీదేవి చెప్పిన మాట పూర్తిగా మరిచి పోయి, ఎవరో తన కన్యాత్వం భంగం చేశారనీ, తనకూ, తన తండ్రి వంశానికి అపకీర్తి వచ్చిందనీ దిగులుపడి, పెద్దగా ఏడవసాగింది.



చెలికత్తెలందరూ నిద్రలేచి ఆమె చుట్టూ మూగారు. చిత్రరేఖ ఆమె పక్కనే కూర్చుని, ఆమె తలను తన రొమ్ముకు అదుముకుని, "చెలీ, భయపడకు. ఎందు కేడుస్తున్నావు? నీ మనసును కష్టపెట్ట సాహసించే వాళ్ళెవరు? నీ తండ్రి బాణుడు కాడా!" అంటూ కన్నీరు తుడిచి ఓదార్చింది.

ఉష తనకు వచ్చిన కల చెప్పి, అది కల అనటానికి వీల్లేదనీ, తనకు తీరని కళంకం చుట్టుకున్నదనీ, తాను కులటనై పోయాననీ అన్నది. అప్పుడు చిత్రరేఖ ఉషకు పార్వతి చెప్పిన మాటలు జ్ఞాపకం చేసి, "ఇవాళ వైశాఖ శుద్ధ ద్వాదశి. ఈ రాత్రి నీకు కలలో కనిపించినవాడే నీకు భర్త అవుతాడని దేవి చెప్పలేదా? సంతోషించక దిగులు పడతావేమిటి?" అన్నది.

వెంటనే ఉష ముఖం మబ్బు తొలగిన చంద్రుడిలాగయింది. "చిత్రరేఖా, నా దిగు లంతా ఒక్క క్షణంలో పోగొట్టేశావు. నా అదృష్టంపండే ఉపాయంకూడా నువే చెయ్యి. వర్ణించలేను గాని, అతని ఆకారం కళ్ళకు కట్టినట్టే ఉంది. అతన్ని నువే వెతకాలి. నా భాగ్యమంతా నీ చేతిలోనే ఉన్నది," అన్నది.

"దానికేం? నే నున్నదే నిన్ను సుఖ పెట్టటానికి కద. అతన్ని తీసుకు రావటం ఒక సమస్య కాదు. ముందు అత నెవరై నదీ తెలియాలి. అది తెలుసుకోవటానికి సాధన మేమిటా అని ఆలోచిస్తున్నాను. నువేమో అతన్ని వర్ణించలేనంటున్నావు. నే నేమో అతన్ని చూడక పోతిని," అన్నది చిత్రరేఖ.

ఉష కళ్ళ నీళ్ళు నింపుకుంటూ, "ఎవరి పనులు వారు చేసుకోవటం సరిఅయినది. ఇంకొకరి పని చెయ్యటం కష్టం. నువు నా ప్రాణం లాంటి దానివి. నిజం చెబుతున్నాను, నువు దయదలచని పక్షంలో నిశ్చయంగా నేను చచ్చిపోతాను," అన్నది.

చిత్రరేఖ ఆమెతో, "ఎందుకు నీకు విచారం? నాకు కాస్త వ్యవధి ఇయ్యి. నీ ప్రియుణ్ణి ఏదో విధంగా తెస్తాను. లోకేశ్వరి అయిన పార్వతీదేవే నిన్ను కటాక్షించి ఉండగా నీ కోరికలు తీరటానికి సందేహమేమిటి?" అన్నది.

చిత్రరేఖ మిగిలిన చెలికత్తెలతో, "మీరు ఉషను కనిపెట్టి ఉండండి," అని చెప్పి, ఏకాంతంగా కూర్చుని, రంగులూ, కుంచెలూ తీసుకుని, ఒక వారంరోజుల లోపల ప్రపంచంలోగల ప్రముఖ పురుషులందరి చిత్రపటాలూ గీసింది. ఎవరెవరు ఎలాటి దుస్తులు ధరించేదీ, ఎలాటి ఆభరణాలు పెట్టుకునేదీ ఆ చిత్తరువులలో సరిగా చిత్రించింది. తరవాత ఆమె ఆ చిత్రపటాలన్నిటినీ ఉష వద్దకు తీసుకుపోయి, "చెలీ, సృష్టిలో ఉండే ప్రముఖుల నందరినీ కష్టపడి చిత్రించి తీసుకువచ్చాను. వీరిలో నీకు కలలో కనిపించిన వాడెవడో చూసి చెప్పు. ఈ పటాలలో దేవదానవమానవ ముఖ్యులందరూ ఉన్నారు," అన్నది.

ఉష ఒక్కొక్క చిత్తరువే చూసి పక్కన పెడుతూ యాదవ ప్రముఖుల దగ్గిరికి వచ్చేసరికి కృష్ణుడి పటం చూసి ఆశ్చర్యపడింది. తరవాత ప్రద్యుమ్నుడి పటం చూసి మరింత ఆశ్చర్యపడింది. ఎందుకంటే ఇద్దరిలోనూ అనిరుద్ధుడి పోలికలున్నాయి. అటుతరవాత ఆమె అనిరుద్ధుడి పటం తీసుకుని తనను తానే మరచిపోయింది. ఆమె దానిని పక్కన పెట్టలేదు. ఉష కలలో కనిపించిన వాడు అతనేనని చిత్రరేఖ గ్రహించింది.





# అరణ్యపురాణం

## 27

ఈ శునకాలను గురించి అకేలాకు కొంత తెలుసును. అతను మౌగ్లీతో రహస్యంగా, "ఒంటరిగా చావటం కంటె మందలో చావటం మేలు. ఇది నా ఆఖరు వేట—మంచి వేట. కాని మనిషి ప్రమాణాన్ని బట్టి నీ కింకా చాలా ఆయుస్సు ఉన్నది. ఉత్తరంగా వెళ్ళి, సుఖంగా పడుకో. శునకులు వెళ్ళాక ఎవరైనా మిగిలితే, యుద్ధవివరాలు తెలుసుకోవచ్చు," అన్నాడు.

"ఓహెూ, నేను వెళ్ళి బురదగుంటల్లో చేపలు పట్టి, చెట్ల మీద నిద్రపోవాలేం? కాయఖు కొరుక్కుతినటానికి మర్కటుల సహాయం కూడా తీసుకోవాలా? మంద మాత్రం పోరాటం సాగిస్తుందేం?" అన్నాడు మౌగ్లీ రోషంగా.

"చావుతో పోరాటమే. ఎర్రకుక్కల సంగతి నీకేం తెలును? నే చెప్పేది విను. చారలవాడు సైతం—" అని అకేలా ప్రారంభించాడు.

"ఆహాహా! నేను ఒక చారలవాణ్ణి చంపాను. షేర్‌ఖాన్ అయితే ఎర్రకుక్కలు మూడామడల దూరాన ఉండగానే తోక ముడిచి పారిపోయేవాడు. విను. ఒక తోడేలయ్య ఉండేవాడు. ఆయన నా తండ్రి. ఒక తోడేలమ్మ ఉండేది—నా తల్లి. ఇంకో ముసలి తోడేలు నాకు తల్లీ తండ్రీ కూడానూ. ఆయన ఇప్పుడు పండిపోయాడు. కనక నేను చెప్పే దేమిటంటే—కుక్కల తండా ఇక్కడికి వచ్చే పక్షంలో వేటలో మందతో బాటే నేనూనూ. నా కత్తి కూడా ఓ తోడేలుకోరే!" అన్నాడు మౌగ్లీ.

"తోడేలు భాష మాట్లాడే మనిషీ, నీకు కుక్కలతండా సంగతి తెలీదు. నేనైనా పగ తీర్చుకోవటానికి పోరాడతాను గాని, ప్రాణా



లతో బయట పడతానని కాదు. వాళ్ళు తాపీగా కనబడ్డదాన్నల్లా చంపుతూ సాగిపోతారు. అది తిండి కోసం జరిగే వేట కాదు—వధ! మీకు పగ తీర్చుకునే సమస్య లేదు. శునకులు వెళ్ళిపోయే దాకా ఉత్తరంగా పోయి మీ మందవాళ్ళు తల దాచుకుని, దొరికినదానితో కడుపు నింపుకోండి," అన్నాడు ఏకాకి.

మౌగ్లీ గట్టిగా నవ్వి, "మందవాళ్ళం ఉత్తరంగా పారిపోవాలట! పారిపోయి బల్లుల్నీ, ఎలకల్నీ పట్టాలిట! వినండి! మనం భయపడి తలదాచుకుంటే వాళ్ళు మన వేటభూములన్నీ ఒక కొలిక్కి తెస్తారట! ఏం? వాళ్ళు కుక్కలు—కుక్కల కొడుకులు! వాళ్ళ కాళ్ళవేళ్ళ మధ్య బొచ్చుంటుంది. ఎలక సంతానం లాగా ఒక్కొక్క కానుపుకూ ఆరుగురూ, ఎనిమిది మందీ పుడతారు. పారిపోతామా? చెప్పండి! వేట సాగాలి! మందంతా కదలండి. ఇళ్ళ కోసం, బిడ్డల కోసం! గుహల్లో ఉండే పసి కూనల కోసం! ఎడా, పెడా వధ చెయ్యండి," అని అరిచాడు.

మంద అంతా అరణ్యం దద్దరిల్లేటట్టు అరిచింది.

మౌగ్లీ తన నలుగురు అన్నలతో, "మీరు వీళ్ళ వెంటే ఉండండి. అకేలా, ఫావోలు యుద్ధయత్నాలు చూస్తారు. నేను వెళ్ళి తండా ఏమాత్రమున్నదీ లెక్క చూస్తాను," అని చెప్పాడు.

ఏకాకి సగం లేచి, "నిష్కారణంగా చచ్చిపోతాడు. శునకుల తండా ముందు ఈ బొచ్చు లేనివాడెంత? చారలవాడు కూడా—జ్ఞాపకం ఉంచుకో," అన్నాడు.

"తండా చచ్చాక మాట్లాడుకుందాం. అందరికీ వేట సాగాలి!" అంటూ మౌగ్లీ చీకట్లోకి పరిగెత్తాడు. అతను చాలా ఉద్రేకంలో ఉండి, అడుగు ఎక్కడ పడుతున్నది కూడా లక్ష్యపెట్టకుండా పరిగెడుతున్నాడు.

దానికి ఫలితంగా అతను కావా చుట్టలకు కాలు తగిలి బొక్కబోర్లా పడ్డాడు.

కావా నదీ తీరానికి సమీపంలో లేళ్ళు నడిచే బాటలో మాటు వేసి దీక్షగా చూస్తున్నాడు. "ఇదేం పని? తపాతపా పరిగెత్తుతూ వేట చెడగొట్టావు!" అన్నాడతను.

"నాదే తప్పు. నేను పోతున్నదే నీ కోసం. ఎప్పుడు కనిపించినా ఇంకా లావూ, ఇంకా పొడుగూ పెరిగి ఉంటావు. నిన్ను పోలిన వాళ్ళు అరణ్యంలో మరోరు లేరు. నీ బుద్ధీ, నీ బలమూ, నీ వయసూ, నీ అందమూ!" అన్నాడు మౌగ్లీ లేస్తూ.

"ఈ స్తోత్రపాఠా లన్నీ దేనికో! ఈ అబ్బి నా మీద రాళ్ళు వేసీ నన్ను నానా మాటలూ అనీ నెల తిరగలేదే? ఆ నోరే ఇంత తియ్యగా పలుకుతుందేం ఇప్పుడు?" అంటూ కావా మౌగ్లీ కోసం చుట్టలు తొట్టి ఉయ్యాల లాగా తయారు చేశాడు.

"అవును, నా వేట దారికి అడ్డొచ్చి, ఈల వేసినా వినిపించుకోకపోతే రాళ్ళు రువ్వనూ!" అంటూ మౌగ్లీ కావా చుట్టల మధ్య సుఖంగా చేరగిలబడి కూర్చుని, ఎర్రకుక్కల వృత్తాంత మంతా చెప్పాడు.

అంతా విని కావా, "తండా ఏ మాత్రం ఉంటుంది?" అన్నాడు.



"నా కేమీ తెలీదు. నేను చూడలేదు. నీ కోసం రెక్కలు కట్టుకుని వచ్చాను. భలే వేట, కావా! ఆ తరవాత ఎంతో మందిమి మిగలం," అన్నాడు మౌగ్లీ ఉత్సాహంగా.

"ఇందులో నువెందుకు వేలు పెడుతున్నావు? నువు మనిషివి. మంద నుంచి నిన్ను వెళ్ళగొట్టిన మాట మరవకు. కుక్కల సంగతి తోడేళ్ళు చూసుకుంటాయి లే," అన్నాడు కావా.

"కిందకేడు కాసిన కాయలు ఈ యేడు మట్టి. నేను మనిషినైతేనేం? నేనూ ఒక తోడేలునే నని వాళ్ళకు మాట ఇచ్చేశాను.

ఈ కుక్కలు దాటిపోయిన దాకా నేను మందలో వాణ్ణే," అన్నాడు మౌగ్లీ.

"మాట ఇచ్చానంటే మరి మాట్లాడను. అయితే ఈ తండా వచ్చిపడితే ఏం చేద్దామని నీ ఉద్దేశం?" అన్నాడు కావా.

"కుక్కలు వాయిన్‌గంగ ఈది రావాలి. లోతు తక్కువ నీటిలో నిలబడి నా కత్తితో వాటిని ఎదుర్కొందా మనుకుంటున్నాను. నా వెంట మంద ఉంటుంది. కుక్కలను నీటివాలుకు మళ్ళించవచ్చునని ఆశ," అన్నాడు మౌగ్లీ.

"కుక్కల తండా పక్కకు తిరగటం కల్ల. నువ్వు చెప్పే వేట ముగిశాక ఒక్క మనిషి కూనా, ఒక్క తోడేలు కూనా కూడా మిగలవు. ఎముకలే మిగులుతాయి," అన్నాడు కావా

"చస్తే, చస్తాం. వేట మాత్రం మజాగానే ఉంటుంది. నేనెన్నో వర్షాలు చూడ లేదు. జ్ఞానినీ కాను, బలంగలవాణ్ణీ కాను. ఇంతకన్న మంచి ఉపాయం నువు చెప్ప గలవా, కావా?" అన్నాడు మౌగ్లీ.

"నూరువర్షాలు చూశాను. చాలా చెట్లు నా కళ్ళ ముందు పుట్టినవి," అన్నాడు కావా.

"కాని ఈ వేట కొత్తది. కుక్కల తండా మన కేసి పూర్వం ఎన్నడూ రాలేదు," అన్నాడు మౌగ్లీ.

"ప్రతిదీ అదివరకు జరిగినదే....నా యేళ్ళు జ్ఞాపకం చేసుకుంటున్నాను, కాస్సేపు కదలకుండా అలా కూచో," అన్నాడు కావా.

ఒక గంటసేపు మౌగ్లీ కదలకుండా ఉండిపోయాడు. కావా తల నేలకానించి గతంలోకి వెళ్ళిపోయాడు. అతని కళ్ళు కాంతివిహీనమై పోయాయి నిద్రలో వేటాడు తున్నట్టుగా అతని తల ఈ పక్కకూ ఆ పక్కకూ తోసుకొచ్చింది. మౌగ్లీ కూడా నిద్ర మగతలో పడ్డాడు. వేటకు ముందు కునుకు అవసరం.



# 81. మూడుతలల బాలీదేవుడు

ఇండొనీషియా అంతటా ఇస్లాము మతం విరివిగా ప్రచారం అయినప్పటికీ, బాలీలో హిందూమత ప్రభావమే జాస్తి. అక్కడ అనేక హిందూ దేవతలకు ఆలయాలున్నాయి. కొత్తవి ఇంకా కట్టుతూనే ఉన్నారు. అక్కడి ఉత్సవాలూ, నృత్యాలూ పూర్తిగా హిందూ సంప్రదాయానికి సంబంధించినవే.



Photo by B. Bhansali



బహుమతి
పొందిన వ్యాఖ్య

మర్కటపాలన

పంపినవారు:
కె. అనూరాధ, హైదరాబాద్

Photo by M. L. Malani



బహుమతి
పొందిన వ్యాఖ్య

శునకలాలన

పంపినవారు:
కె. అనూరాధ, హైదరాబాద్

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1968 అక్టోబర్ నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి ఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ అగష్టు నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న పెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## అగష్టు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: మర్కటపాలన

రెండవ ఫోటో: శునకలాలన

పంపినవారు: కె. అనూరాధ,

హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 29

బహుమతి మొత్తం రు. 10/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# 'నేను కొత్త ట్రాక్టర్ కొనుక్కున్నాను – పంజాబ్ నేషనల్ బ్యాంకుకు ధన్యవాదాలు'





పి యన్ బి రైతులకు, ట్రాక్టర్లు, వ్యవసాయ యంత్రసామగ్రి, పంపింగ్ సెట్లూ, మేలిరకం విత్తనాలూ, ఎరువులూ, తెగుళ్లు నివారించే మందులూ, పాడిపరిశ్రమకూ, కావలసి వచ్చే యంత్రసామగ్రి పనిముట్లూ మొదలైనవి కొనుక్కునేందుకు అప్పులు మంజూరు చేస్తున్నది. దీర్ఘకాలానికీ, స్వల్పకాలానికీ కూడా, ఈ డబ్బు మంజూరు చేస్తారు.

*ఇంకా వివరాలకోసం, మీకు దగ్గరలో ఉన్న పి యన్ బి బ్రాంచికివెళ్లి సంప్రదించండి. మాకు దేశమంతటా 500 మించి బ్రాంచీలున్నాయి.*

## పంజాబ్ నేషనల్ బ్యాంక్

*1895 నుంచి జాతికి సేవ చేస్తున్నది*

బ్యాంకు చైర్మన్: యస్. పి. జైన్

PR-PNB-686 TEL-1




పుష్టికరమైన తుషార్ మీ యింట్లో వంటలకు చాలా మంచిది. ఎ, డి విటమిన్‌లు కలిగివున్న తుషార్ వంటకాలను రుచికరం చేయడమే. తుషార్‌తో వండిన వంటకాలు రుచికరంగా ఉండడమేగాక మీ వంటికి చాలా మంచిది.

తుంగభద్ర
ఇండస్ట్రీస్ లి.,
కర్నూలు.

# తుషార్‌తో వండిన వంటకాలు అత్యంత రుచికరం.



ASP TIL T 29 TEL

